# జయంతి

సంపుటము ౧ ౧ సంచిక

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.

భర్తృహరి.

(పునర్ముద్రణము.)

సంపాదకుడు:
విశ్వనాథ సత్యనారాయణ.

# విషయసూచిక.

# [illegible]ంతి ఆలోచనా సంఘము

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు, బారిష్టరు, గుంటూరు
[illegible]జమూరి రంగాచార్యులుగారు, ఎం, ఏ; బి, ఎల్ ,,
[illegible]మూరి కనకాచలం పంతులుగారు ఎం, ఏ; ఎల్, టీ, పర్లాకిమిడి
[illegible]డూరి వెంకట సుబ్బారావుగారు, బి, ఏ; బి, ఎల్, ఏలూరు

[illegible]ము:—

శ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు, విజయనగరం
,, కిళాంబి రంగాచార్యులు గారు, ఎం, ఏ; బి, ఎల్, ,,
,, బంకుపల్లి మల్లయ్యశాస్త్రి గారు, పర్లాకిమిడి
,, కావ్యవ్యాకరణతీర్థ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు

లలితకళలు:—

,, అడివి బాపిరాజుగారు బి, ఏ, చెన్నపట్టణము
,, బెల్లంకొండ రాఘవరావుగారు, పమిడిపాడు
,, గొడవర్తి రామదాసుగారు, బిఏ; యం, ఆర్, ఏ, యస్, జయపురము

వార్తాశాస్త్రము:—

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు. ఎం, ఏ; ఎల్ టీ, విజయనగరము
,, బసవర్సు రామచంద్రరావుగారు, ఎం, ఏ, కలకత్తా

చరిత్ర – రాజనీతి:—

శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు, బి, ఏ; బి, ఎల్, రాజమహేంద్రవరము.
,, వింజమూరి గోవిందరాజాచారిగారు, బి, ఏ; బి, ఎల్, చెన్నపట్టణము
,, కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు, బి, ఏ; బి, ఎల్, ,,

భౌతికశాస్త్రము:—

శ్రీ డాక్టరు ఎ, ఎల్, నారాయణగారు, ఎం, ఏ; డి, ఎస్, సి, యఫ్, ఐ, పి, విజయనగరము.
,, డాక్టరు జయంతి చినకామేశ్వరరావుగారు, ఎం, ఏ; డి, ఎస్, సి, చెన్నపట్టణమే.
,, పాతూరి, పట్టాభిరామయ్యగారు, ఎం, ఏ; ఎల్ టీ, బందరు

రసాయనశాస్త్రము:—

శ్రీ కాళ్లకూరి సూర్యనారాయణగారు, ఎం, ఏ; ఎల్ టీ, చెన్నపట్టణము
,, సుసర్ల రాజుగారు, బి, ఏ, బందరు

ప్రకృతిశాస్త్రములు:—

శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు, ఎం, ఏ, అనంతకళాశాల కొలంబో
,, డాక్టరు వుప్పల లక్ష్మణరావుగారు, ఎం, ఏ; డి, ఎస్, సీ; (జర్మనీ) బందరు
,, పురాణం సూరిశాస్త్రి గారు, బి, ఏ,




## అధునా.

ఇదివరకే తెలుగుదేశంనిండా పత్రికలు కోటానకోట్లు వున్నవి. ఇంకా క్రొత్తపత్రిక లెందుకయ్యా అనవచ్చు పెద్దలు.

ఎవరిమట్టుకువారికి పత్రికపెట్టేందుకు తగినవి కాకపోయినా కారణాలు కనబడుతూనే వుంటవి.

ఈకాలంలో పత్రికలసంపద, ఖండకావ్యాలూ, చిన్నకథలూ, నవలలూ, నాటకాలూ విమర్శనలూ, అన్నిని. అగ్రస్థానం కథకీ ఖండకావ్యానికీ చిత్రాలకూ. కథలకేం ఖండకావ్యాలకేం పాశ్చాత్త్యుల వరవడి. 'సరిగా అనుకరించడం ఉపజ్ఞలేకుండా కుదరదు. ఇప్పటికి తెలుగులో బయలుదేరిన మంచికథలు వేళ్లమీదలెఖ్ఖపెట్టవచ్చును.

ఖండకావ్యాలస్థితి కథలంత నాసిగా లేదు. ఖండకావ్యాలకి రూపం యేర్పడ్డది. ఏర్పడ్డదిఅంటానికి యింతమంది దుయ్యబట్టటమే సాక్ష్యం. దీనివలన భావకవులు రసవంతంగా వ్రాశేవాళ్లు, దేశంలో తగినంత మంది వున్నారనీ, ప్రతివాడూ ఒక్కొక్క వ్యక్తిత్వంతో భాసిస్తున్నారు అనీ, తేలుతోంది.

భావకవిత్వం అనగానే భావంలేని కవిత్వం వుంటుందా అనీ. భావకవిత్వంకాదు బావకవిత్వం అనీ అంటున్నారు.

పంకజంఅంటే నత్తగుల్ల కాకూడదూ ?

కొన్నిలక్షణాలుండి పూర్వకవితకు భిన్నంగా వుండటంచేత దానికి కాలప్రవాహంలో యీపేరు వచ్చింది. అల్లా చాలాశబ్దాలకి అర్థం మ్పుడుతూ వుంటుంది. వాటినే రూఢాలు అంటారు అని జవాబు.

ప్రకృతం నవలల్లో సంస్కరణం జరగాలి. మననవలలు వంగీయుల అంగ్రీకరణాలు. కొన్ని ఆచారాలూ, వ్యవహారాలూ సమానంగా వున్నా, జీవితనిగూఢోద్రేకాలల్లో వారికీ మనకూ సాటువలేదు. వాళ్ల ప్రకృతిలో భక్తిపాలు ఎక్కువ. భక్తి స్త్రీప్రకృతి. జ్ఞానము పురుష ప్రకృతి. స్త్రీప్రకృతివుండటం కవికి మెరుగు. మేము దాన్నే అనుసరిస్తామంటారు కొందరు. నాటక రచనల్లో సంస్కృతవాఙ్మయం వలెనే నవలల్లో పాశ్చాత్యవాఙ్మయం ఆదర్శం కాదగ్గదేమో!

మననవలకు యిది లక్షణమయింది.—నెలకిఒకనవల. కొంచెం భాషా పరిచయం కలవాడు (ఎప్పుడూ వాడికి డబ్బుయిబ్బందే గనక) వ్రాస్తే, ఒకవందరూపాయిాలు. ఆపైన టెక్స్టుబుక్కుకమిటీవారు అనుగ్రహిస్తే మరినాలుగు పైసలు.

ఒక్క నవలే యేమిటీ ? భావకవిత్వంతప్ప తక్కినవాటికి అన్నింటికీ యిదేదశ పట్టింది. ఫలాపేక్ష లేకండా సృష్టించినశిల్పం సర్వోత్కృష్టంగా వుంటుందనివూహ.

ప్రతీవాళ్లూ రసవంతంగా వ్రాస్తామనీ నిజంగా క్రొత్తమార్గాలు తొక్కుతున్నామనీ. అందుచేత నిజంగా క్రొత్తమార్గాలుపోయే దివ్యులకు ఈఘట్టంలో ఆశా అంటూ లేదేమో!

స్వతంత్రత కల దేశాల్లో వాళ్లభాషలో కవికి మంచివుద్యోగం ఇచ్చి పాలకులు గౌరవిస్తారు! మనదేశంలో దేశభాషకూ ఆకవికీ పాలకుల ఆదరణ లేకపోవటానికి ముఖ్యకారణం రాజభాష కాకపోవటమే.

తుంటా.

ఇంకా కారణాలు వున్నవి. దేశంలో చదువుకున్నవాడూఅంటే ఇంగ్లీషు చదువుకొన్నవాడే. అతనికి కీట్సు షెల్లీ షేక్స్పియరుల పరిచయం వున్నంతగా పోతన్న పెద్దన్నతిక్కన్నల పరిచయం లేదు. కాని ప్రకృతం కవిత్వం ఆదరించాలశింది అతను.

ఇక నేటిపండితులు. వారికి తెలుగుమీదకన్న సంస్కృతంమీద గౌరవం. ఏదన్నా క్రొత్తత్రోవఅంటే అట్లా పూర్వం వుండాలి. అప్పుడది రైటూ. కావ్యానికి మొదట మూడవకంటిమంటవుంటే అశ్లీలం. పూర్వకవి ఇల్లాగే వర్ణించాడుఅంటే ఒప్పుకుంటారు.

*

స్వేచ్ఛ లౌకికజ్ఞానం చురుకుదనం సామాన్యంగా రాజభాషని ఆశ్రయించి వుంటవనీ, ఆరాజభాష మనమాతృభాష కాకపోవడంవల్ల యిట్లావుందనీ కొందరు. ఇంగ్లీషుచదివినవారికి భాషాప్రయోగపద్ధతి తెలుసు. పండితులకు పూర్వమార్గాలూ జాతిసత్త్వాలూ తెలుసు. ఇవిరెండూ భిన్నంగా నడిచినన్నాళ్లూ ఇంతే అనికొందరు.

*

ఇంతకన్నా పెద్దకారణం పత్రికాధిపతులనీ, ఇతరదేశాల పత్రికాధిపతులు పండితులూ రసజ్ఞులూ అనీ, రచనలన్నీ వాళ్లదగ్గరకి వస్తే మంచివి స్వీకరించి చెడ్డవి తిరస్కరిస్తూ, దేశంలో రసజ్ఞత్వం కలిగించి పాఠకులకు త్రోవచూపిస్తూ వుంటారనీ అంటారు. మనదేశంలో పత్రికాధిపతులు ధనవంతులు. పాశ్చాత్త్యభాషాసంపర్కంవల్ల భావౌదార్యం వారికి వుండవచ్చు. కాని దేశభాషతో తగినంత పరిచయం లేకపోవటం లోపం.

దీనివల్ల రచయితలూ పత్రికాధిపతులూ పాఠకులూ అసమర్థులని కాదు. సమర్థులసంఖ్య చాలాకొద్ది అనే.

*

మనపూర్వాధునికకవులు ఇతరదేశ పూర్వాధునికకవులతో। తూగలేరని కొందరివుద్దేశం. కవిత్వం దేశకాలపాత్రాలని అనుసరించి వుట్టు

తుంది అంటారు. షేక్స్పియరు తెలుగుదేశంలోనూ, తిక్కన్న ఇంగ్లండులోనూ పుట్టటం ప్రకృతిధర్మం కాదేమో! ఎక్కడా కవులు కొద్దిమందే. వారిలో శక్తి వుంటుంది. అది తెలుసుకుంటే క్రొత్తసృష్టి వస్తుంది. ఇది ఆంధ్రులకు కూడాను.

*

అసలుమనదేశం అస్వాతంత్ర్యంలో వుందంటే మనభాష యీస్థితిలో వుండటమే కారణం. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు ప్రధానభాష అయితే ఆంధ్రవిశ్వవిద్యాలయంలో తయారయినవిద్యార్థులు ఆంగ్ల భాషాభిమానులే అవుతారు. కవిత్వం ఎప్పుడూ సంఘమతాచారాలని రమ్యంగా హృదయాకర్షకంగా చెపుతుంది అంటారు ఆకవిత్వం చదవటంతోటే ఆసంఘమతాచారాలయందు అభితయిష్టం పుటుతుంది. ఇక సాతనప్రియులు తన్మయులే.

మనమతంకన్న ఏమాత్రంసంస్కారం వున్నా, తక్కినమతాలు సులభంగా అర్థమవుతే. ఒకటిబాగా త్రెంచుకొన్నతరువాత రెండోదానిమీదికి బుద్ధి చాలా ఆలోచనాపటిమకికాని పోదు. షెల్లీని షేక్స్పియర్‌ని చదివింతరువాత ఛీ! మనవాళ్లెమిటనిపిస్తుంది. వాళ్లదేశం అవా్న వాళ్ల సంఘాచారాలన్నా అభిమానం పెరుగుతుంది. అట్లాగే తిక్కన్నపోతన్నలనే మొదటమెచ్చికొంటే ఆఅభిమానం ఇక్కడ ప్రవహిస్తుంది.

ఆంధ్రవిశ్వవిద్యాలయంలో చదివినవిద్యార్థులందరూ షేక్స్పియర్ షెల్లీలకుమల్లే తిక్కనామాలయాదుల గౌరవంకలవాళ్లయి వీళ్లశిల్పం అట్లా తెలుసుకుంటే మరునిమిషం వీళ్లకి స్వరాజ్యం కావద్దూ. మాతిక్కనయింతవాడని యితరదేశాలవాళ్లకి చూపించవద్దా.

కార్లైలని అడిగారట ఎవరో? ఒకవేళ వదలిపెట్టాలంటేస్తే హిందూదేశంవొదలిపెటతావా! షేక్స్పియర్‌ని వొదిలిపెటతావా అని. హిందూదేశమే వదిలేస్తానన్నాట్ట. అది సారస్వతం రుచి! ఇదే ఇప్పటి ప్రశ్న అడిగితే తిక్కన్ననే

భావం బ్రతుకుమీద ఆధారపడి వుంటోంది. ప్రతిఆంధ్రుడి బ్రతుకు ఇంగ్లీషు ఆక్రమిస్తే, "ఆంధ్ర" భావం ఎక్కడ?

ఆంధ్రుడికే మానసికశారీరాలు భిన్నంగావున్నై. ఇంతట అధమం భావాన్ని అయినా కాపాడితే మెఱుగని తోస్తుంది.

స్వాతంత్ర్యమంటే యేమిటి? సంఘమతాచారాల్లో వ్యవస్థవుండటం, వ్యక్తిత్వం చావకుండా చూసుకోటం. ఈసంఘమతాచారాలకి ప్రధానజయస్తంభం సారస్వతం. ఆసారస్వతాన్ని ఎండగడితే చైతన్యం పోతోంది.

*

ఈశారీరకమానసికమార్గములభిన్నత్వం ప్రతిబింబంలాగా మనందినమూ పోయే నాటకాలు విస్పష్టంగా సూచిస్తున్నవి.

నాటకంహాలునిండా విచిత్రమైనబొమ్మలు. అవి గ్రీకు దేశపుస్త్రీల బొమ్మలు. తెరలన్నీ ఆడేనాటకాలకు సంబంధించనివి. ఆడేనాటకం తెలుగునాటకం వెనకతెరా అదీ ఇంగ్లీషువాంగు.

నేత్రం వాంఛించేది వకటి. మనస్సు వాంఛించేది వకటి. దుష్యంతుడు ముందర ఇంగ్లీషుడాన్సు. నలుడివేషం నేటి ఒకమహారాజాఖర్తు. ఈనల్ల పెదవులనలుడూ నొక్కుకళ్లనలుడేనా కలినాశకుడుగా కీర్తింపబడ్డనలుడు? ఇందుకే సంప్రదాయం తెలియాలి అంటారు.

*

ఏజగత్తుకైనా జీవితానికయ్యేభాషే పరిగ్రాహ్యం. ఇక మనదేశంబాగుపడాలంటే తెనుగుభాషే జీవితానికయ్యేభాష కావాలి. తక్కినవన్నీ తరువాతి.

వి. స.

శ్రీశివాజీమహారాజు జన్మించి ఇప్పటికి మూడువందల సంవత్సరాలైనది. ఈవిషయము దేశీయులకు జ్ఞాపకము చేయడానికిన్నీ, ఆయన పవిత్ర జీవితము వల్ల దేశానికి కలిగిన మహోపకారమును స్మరించడానికిన్నీ, ఈమధ్య గొప్పఉత్సవాలు చేశారు. ఈవిధంగానే 1922-వ సంవత్సరములో రాజమహేంద్రవరములో 'ఆంధ్రదేశైతిహాసికమండలి' వారు రాజరాజనరేంద్రుని పట్టాభిషేకమహోత్సవమును జ్ఞప్తికి తెచ్చినారు. ఏజాతిఅయినా తరించడానికి వీరారాధన చాలా అవసరము. అందులో ముఖ్యంగా పరాధీనమైన జాతులు ఇట్టి ఉత్సవాలు తప్పకుండా చేయాలి.

శివాజీ 1627 లో జన్మించాడు. అప్పటికి అనేకవందల సంవత్సరాల క్రిందనే మహారాష్ట్రీలు స్వరాజ్యమును కోల్పోయినారు. హిందూ రాజ్యాలలో మేటిఅయిన విజయనగరసామ్రాజ్యము అంతరించినది. మరలమహారాష్ట్రీల యూజమాన్యముక్రింద ఇంకొక హిందూసామ్రాజ్యమును స్థాపించి హిందూధర్మమును ఆచారమును ఉద్ధరించినవాడు శివాజీ. ఒకవంద సంవత్సరాలు గడిచేటప్పటికి, అనగా 1727నాటికి మహారాష్ట్రసామ్రాజ్యము భరతవర్షమంతా వ్యాపించినది. 1827నాటికి వీస్వాల్ప్రతిభ అంతరించి, ఆంగ్లేయరాజ్యము హైకివచ్చినది. 1927లో హిందువులు మహమ్మదీయులు తమభేదాలు మరిచిపోయి, శాంతిమార్గాన స్వరాజ్యము సంపాదించడానికి యత్నిస్తున్నారు. కాబట్టి,శివాజీ హిందువుడైనా, ఈఉత్సవాలలో అందరూ పాల్గొంటున్నారు. శివాజీ, అక్బరు వంటి మహాపురుషులు భారతీయవీరు లేగాని, కేవలము హిందూ మహమ్మదీయులు కారు. శివాజీవంటి వీరులు, జీజాబాయివంటి వీరమాతలు ఎందరో బయలుదేరాలి. మహారాష్ట్రీలు ఆంధ్రులకు అనేకవిషయాలలో దగ్గిర వారు. అందుకనే మొన్నటి ఉత్సవాలు ఆంధ్రదేశములో బాగా జరిగినవి.

సమగ్రమైన విశ్వాసపాత్రమైన భారతవర్ష చరిత్ర రచించడానికి దేశీయ పండితు లంతా పూనుకోవాలి. మనదేశములో ఆంధ్రులు మహారా

ష్ట్రులు, వంగీయులు, అనే చాలా ఉపజాతులున్నవి. ప్రతివారున్నూ తమ ప్రాంతానికి సంబంధించిన చరిత్రను చక్కగాశోధించి తమభాషలోనే కాకుండా ఆంగ్లములో కూడా ప్రకటించాలి. ఈసందర్భములో మహారాష్ట్రులు చేసినకృషి చాలా ప్రశంసింపతగ్గది. రాజవాడీ, సర్దేశాయి, పరసనీస్, మొదలైనవారు ఎంతో శ్రమపడి తమప్రాంతీయచరిత్రకు ఆధారములైన ఉత్తరాలు, దస్తావేజులు, వంశావళులు, ప్రకటించారు. ఇతర ప్రాంతాలవారు కూడా ఈవిధంగా కృషిచేసినట్టయితే కొద్దిసంవత్సరాలలో నిజమైన దేశచరిత్ర బయలుపడుతుంది.

ఆంధ్రచరిత్రకు ఆధారభూతములైన శాసనాలు, కయఫీయతులు, వంశచరిత్రలు, ఏమూలాలలోనో అణగివున్నవి. కొద్దిమంది పరిశోధకులకు మాత్రమే వాటినిగురించి తెలుసును. సామాన్యముగా చదువుకున్న ఆంధ్రులందరికీ అందుబాటులో ఉండేటట్టు ఈపత్రికలో కొన్నిటిని ప్రకటించ దలచినాము. అంతేకాక పరిశోధకుల వ్రాతలను ఉపయోగించి సులభముగా విషయము తెలిసేటట్టు వ్యాసములు కూడా ప్రకటించాలి. భారతభాగవతాలు ఎంతశ్రద్ధగా చదువుతారో దేశచరిత్ర కూడా అట్లాచదివేటట్టు రుచి కల్పించాలి. ఈప్రయత్నానికి అంతా తోడ్పడుతారని నమ్ముతున్నాము.

-ధరణికోటదగ్గర కృష్ణానదీతీరమున ఒకచలువరాతి స్తంభం ఉన్నదనీ దానిమీదశాసనాలు ఉన్నవనీ గుంటూరుకలెక్టరుగారు గౌర్నమెంటు శాసనశాఖవారికి తెలియజేశారట. అందుమీదట శాసనశాఖవారు ఆప్రదేశానికివెళ్లి ఆపురాతనస్తంభం పరిశీలింపగా దానిమీద క్రీస్తుశకం మూడునాలుగు శతాబ్దాలనాటి బ్రాహ్మీలిపి శాసనం కనిపించినదట. ఆకాలంలో అమరావతికి వచ్చి బుద్ధదేవుని సందర్శించి దానధర్మాలుచేసిన బౌద్ధయాత్రికులపేర్లు ఆశాసనంలో ఉన్నవట. గౌర్నమెంటు శాసనశాఖాధికారికి తెలియపరిచి చెన్నపురి శాసనశాఖవారు ఆప్రాచీన స్తంభాన్ని కష్టపడి చెన్నపట్టణం (మ్యూజియము) చిత్రవస్తుప్రదర్శనశాలకు తరలించారట.

ఆంధ్రులకళాకౌశల్యానికి అమరావతీస్థూపమే పెట్టిందిభిక్ష. ఆంధ్రులశిల్పకళానిపుణతకు అదిఒక్కటే ఇప్పటికీ తార్కాణంగాఉన్నది. ఎంతశిథిలావస్థలోఉన్నా, దానిలోనుంచిఅందమైన శిల్పాలుగల రాళ్లూ స్తంభాలూ అన్నీయిదివరకే లండను చేరినవి. మిగిలినవి చెన్నపురికివచ్చినవి. ఇంకా అక్కడక్కడ చెదరిపోయి ఇట్టిస్తంభాలు బయలుపడుతూ ఉంటే వాటినికూడా వున్నచోట వుంచకపోతే మానె, తుదకుబెజవాడ మొదలగుచోట్ల అయినా వుంచక చెన్నపట్టణంతీసుకు వస్తున్నారు. ఇదిచాలా అన్యాయం. ఇట్లు చేయడంవల్ల ఆంధ్రులు ప్రాచీన వస్తువుల విలువ తెలియనివారనీ, ఆంధ్రదేశంలో అట్టివాటిని ఉంచడానికి తగినస్థలంలేదనీ—ఇట్టి అభిప్రాయాలు కలుగుతవి. అదిన్నీకాక అటువంటి ప్రాచీనవస్తువులు ఆంధ్రదేశంలో ఏప్రాంతలదొరకినా, వాటిని చెన్నపట్టణంచేర్చడం ఆచారమైనది. ఇదిచాలా కూడనిపని. ఆంధ్రులు ప్రత్యేకరాష్ట్రం కావాలని వాదిస్తున్నారు. శాసనసభలోకూడా ఆంధ్రరాష్ట్రానికి ఆమోదంవచ్చినది. ఆంధ్రులకు ప్రత్యేకం విశ్వవిద్యాలయంవచ్చినది. చెన్నరాజధానిలోనుంచి ఆంధ్రరాష్ట్రాన్ని విడదీసే కాలంసమీపిస్తున్నది. పంపుళ్లు అన్నీజరిగిపోతున్నవి. ఇట్టిసందర్భాలలో ఆంధ్రదేశపు ప్రాచీనసంపదను చెన్నపట్టణం చేర్చడము కేవలము అధర్మము. ఇట్టివి బెజవాడ మ్యూజియములోనే వుంచుటకు ఏర్పాట్లు చేయుట యుక్తము. ఇకముందైనా ఇట్టివిషయాలలో గౌర్నమెంటువారు ఆంధ్రులపట్ల ఉదారబుద్ధితో వర్తించడము యుక్తము. కో. తా.

# ఫలశ్రుతి

౧

అంతశ్రమపడి పావన మభ్రగంగ
ధారుణికి తెచ్చినాడు భగీరథుండు
అంత మథియించి క్షీరరత్నాకరమ్ము
అమృతభాండమ్ము పడసినా రమరవర్యులు.

మత్పురానేక పుణ్యజన్మములు పండి
జాహ్నవీస్వచ్ఛవును సుధాస్వాదుమూర్తి
వైన నీదివ్యసాన్నిధ్య మంటుకొంటి
పుడమికిన్ స్వర్గమున కొక్క ముడిరచించి.

ఇంతకాలమ్ముగా నాకదృష్టము లయి
ఎన్ని ఆనందధామమ్ము లీ యనంత
భువనసంధుల భాసిల్లు నవియు నేడు
మత్పదాక్రాంతములు భవన్మహిమ జేసి.

మునుపుపద్యమ్ము వ్రాయుటయనిన గుండె
చీల్చుకొనినెత్తురుల్ బయల్ జిమ్మెననుట
ఇపుడు పద్యమ్ము ప్రేమపొంగించుకొన్న
నా నవానందవాహినిలోని నలుసు.

మునుపు పద్యమ్ము వ్రాయనిదినము లేదు
ఇప్పు డానందపరమార్థ మేలుచున్న
నాదుహృదయాంతరాళమ్మునన్ ధ్వనించు
అసలు పద్యమ్ము వచ్చిన దని సతమ్ము.

౩

ఈయగమ్య పర్వత పంక్తు లెక్కివచ్చి
నీ గృహప్రాంగణమ్మున నిల్చినాను
నా యెడద సంశయావిష్టమై యెఱుంగ
బడని యర్థమ్ము లైన నీభావగతుల
పరమపదనాథుకౌఁగిలి పార్వతియుఁబోలె
నాకౌఁగిలి యోగముద్ర నున్నావు నీవు.

౪

నీతోఁడ తలాడగా శయనింప గలిగి
దేవి! నాజన్మమ్ముఁ సమర్థించినాను
ముక్తి సీమంతినీత్రపాముగ్ధ వరద
హస్తవలయితుఁడౌ పరమాత్ముఁబోలి.

నాయని సుబ్బారావు.

# వేఁగిక్షేత్రము

ఏ రాజు పంచెనో యిచట శౌర్యపు పాయసమ్ములు నాగులచవితినాళ్ల
ఏ యెఱ్ఱసంజలో నెలమి పల్లవరాజకముఁలు కాళ్లఁ బారాణు లిడిరో
చిత్రరథస్వామి శ్రీరథోత్సవములోఁ దెలుగు పిల్లలు కత్తి త్రిప్పిరెపుడో
ఏ రెండు జాముల యినుని వేఁడిమి వచ్చి కలసి పోయెనో త్రిలింగప్రభువుల

నాజగచ్ఛ్రీయశంబులై యలరుతొంటి
వేంగిరాజుల పాద పవిత్రచిహ్న
గర్భితమ్మైన యీభూమిఖండమందు
సశ్రుఘులు జార్త్రి జీవచ్ఛవాంధ్రజనులు.

ఇట వేఁగీశుల పాదచిహ్నములు లేవే! లేవుపో! భావనా
స్ఫుట మూర్తిత్వమునైనఁ బొందవు నెదో పూర్వాహ్ణమధ్యాహ్నలపుం
ఘటికల్ గర్భమునం దముద్చుకొనియెం గాబోలు నీపల్లెచో
టట లోకాద్భుతదివ్యదర్శనము లే యాభోగ మేలాటిదో.

నియతుల ప్రభావ మహనీయత వేఁగిపురాధిరాజమా!
ఆయతధర్మమూర్తులు మహాత్ములు వారలు బ్రహ్మకోశగో
పాయిత లాంధ్రపల్లవనృపాలురహుంకృతి వ్యాఘ్రసుగర్జ
నై యరిలోకభీకర మహోద్భుత శౌర్యసనాత్కృతిం జనెః

ఈ నాపదార్పితక్షోణి నేరాజు ధర్మాసనంబుండి స్మృత్యర్థమనెనొ
ఈనాదృగావృతంబైన భూమిబలలోన నేశౌర్యధనులు శిక్షింపఁబడిరొ
ఈ నాశరీరముం దివతళించిన గాలి యెంత పౌరాతన్య మేచుకొనెనొ
ఈ నాతనూపూర్ణమైన యాకాశమ్ము నేక్రతుధ్వనులు శబ్దించినదియొ

అస్మదజ్ఞాతపూర్వాదివ్యత్వ మొప్ప
నిపునీతావనీఖండ మిచట నిలచి
యస్వతంత్రత దొరలు నాయాంధ్రశక్తి
నన్నుఁగంపింపఁ జేయుచున్నది భృశమ్ము.

వేఁగిరాజ్యపు పల్లెవీథుల చెడుగుళ్ల రిపులఁ గవ్వించు శిరువులు తెలిసి
ఎగురుగోడీబిళ్ల సొగసులో రిపుశిరస్సుల బంతులాడు శిక్షలకు డాసి
చెడ్డాడి యుప్పుతెచ్చిన నాఁటి శాత్రవవ్యూహముల్ పగిలించు నాఁ డవుగఁ దలచి
కోతికొమ్మచ్చిలో కోటగోడల కెగఁబ్రాకి లంఘించు చంక్రమణ మెఱిఁగి

తెనుఁగులంతడ్డెయువి నేర్చుకొనియ యుందు
రన్నగాఁ డిగ్గుతల్లులు ...న్న శౌర్య
రస ముంచిచి యుగ్గుఁ బాలతో రంగరించి
బొడ్డుకోయని ...వకే పోయుచు రట.

శిలవోలెఁ గదలంగ లేక హృదయస్నిగ్ధార్ద్రసద్భావనా
ఖలచైతన్యుడనై పురావిదిత వేంగీపూజ్య సామ్రాజ్యగా
థల యోజించుచు నాంధ్రపల్లవనరేంద్ర శ్రీయశస్తంభమున్
బలె నిల్చుంటిన యీపవిత్రధరణీభాగంబునం దీగతిన్

ఏదివ్యపూరుషు లీశాద్వలాంకూర శేఖరమ్ముల లిఖించిరో! యివెల్ల
ఈ వాయుపీచిలో నేయప్సరస్సమాజము నింపిరో గీతిసముదయంబు
ఏదివ్యశిల్పు లీరోదసీకుహరాన వ్రాసిరో దివ్యశిల్పమ్ము లిన్ని
ఈ పథాంతరమునందే పురాణమునీంద్రసంతతులో ప్రశంసలు పొసర్తో

ఎటఁ గనినఁ బూర్వపల్లవ నృపచరితలె
వ్రాయఁబడి పాడఁబడి గేయఁబడి యుపన్య
సింపఁబడి శ్రోత్ర పేయమై చెన్నుదాల్చె
నీయతీంద్రియశక్తి నాకెట్లు లబ్బె!

ఈపాలాతాంతచే వెక్కిరించుకొన్నవో గుండెవ్రయ్య సముద్రగుప్తుడడలె
ఈనేల పావిత్ర్యమెంత కుంభించెనో చిత్రరథస్వామి సేనలుకొనె
ఇట పల్లవులరాచయెలనాగ లేవ్రతమ్ములు చేసిరో లచ్చి నిలుకడ వడె
ఈకాశ్యపీఖండ మేశరజ్జ్యోత్స్నలో పులకించెనో కీర్తి తెలుపు లూరె

ఇట నెచట త్రవ్వినను బంగరేనట యది
యెంతశ్రీయొ! యదెంత రాజ్యేందిరయొ ప
దానతనఖాగ్రపాతనిర్యన్నిధాన
మైన యీచోటనుపభోగ్య మయ్యె నేడు

ఈ పొదలఁ జరిగుచుండు నహీనమహోమహిమానుభావమహా
నేపురవీథుల్లందొ చరియించుచు నుంటి నటంచుఁ బౌరతం
త్ర్యాపతితుండ నయ్యును పురా మహదాంధ్రమునన్ స్వతంత్రుఁడై
నేపురుషుండనో యనుచు నీ భ్రమ సత్యముగాఁ దలంచుదున్.

ఏపల్లవనృపాలు డెత్తినబావుటా చాళుక్యనృపులరాజ్యంబునందు
ఏదేశికవిత పాలించినకవిరాజు నన్నయ్య వ్యాకరణంబునందు
ఏయులిఁజెక్కునేర్చెలు మహాశిల్పి గోదావరీనదీఘోషయందు
ఏతొంటితెలుగుల యొక్కవాచారమ్ము బలవన్నృపులప్రాభవమ్మునందు

సమసిపోయెనో — ఉన్మత్తసామజంబు
కొలను జొంబడి తమ్మితూడులను పెరికి
వైచుచొ మెఱుంగుగాని తత్పద్మగర్భ
కేసర విమిశ్ర మధురసాగ్రియత గలదె?

ఇమ్ముగఁ గాకుళమ్ము మొదలీవరకుం గల యాంధ్రపూర్వరా
జ్యమ్ముల పేరుచెప్పిన హృదంతరమేలొ చలించిపోవు నా
ర్ద్రిమ్మగు చిత్తవృత్తులఁ బురాభవవిన్నయమేని ఎన్నిజ
న్మమ్ములుగాగ నీతనువునన్ ప్రవహించునొ యాంధ్రరక్తముల్.

ఇది వినిపింతు నంచు మది నెంచెద మిత్రులకున్ గళస్థగా
ద్గదికము లోచనాంతబహుధాస్రుతబాష్పనదమ్ము స్పందనా
స్పదహృదయమ్ము నాపనికిఁజాలక చేసెదు నన్ను నింతగా
నెడ పదిలించుకొన్న దిది యొక్కడి పూర్వపుజన్మవాసనో!

విశ్వనాథ సత్యనారాయణ.

# కలతనిదర

ఈ రేయి నన్నొల్ల నేరవా రాజా!
వెన్నెలల సొగసంత యేటిపాలేనటర?

ఆకాశ మేమూలో
అణగి పోయిన రేయి
యేటి శెందురుడల్లె
సాగి పూవుల కులికి॥ ఈ॥

ఆకాశ మావొరస
అడిలి పోయిన రేయి
మాట లెరుగని పాప
యేటి గిలగిల సూపి॥ ఈ॥

ఆకాశ మోతీరు
ఆవు లించిన రేయి
మిసమిసలతో యేటి
పసలతో నను సుట్టి॥ ఈ॥

వెలుతు రంతా మేసి
యేరు నెమరేసింది—
కలవరపు నాబతుకు
కలతనిద రయ్యింది॥ ఈ॥

ఒక్కతెను నాకేల
ఓపజాలని సుకము?
యీ రేయి నన్నొల్ల నేరవా రాజా!

నండూరి సుబ్బారావు.

# కోకిలమ్మ పెళ్లి

తేతబుర్రలు కొక్కిరిస్తే
ఆతగాళ్లతో యేమిగానీ
తాతతాతల నాటికతలూ
తవ్విపోస్తానోయ్-

ఊగులాడే కడలి తరగలు
నాగుబాముల కోపలల్లే
ఒడ్డుదాకా ప్రాకి ప్రాకీ
ఒరిగిపోతా రోయ్-

ఒడ్డుదాకా అడివి అడివిలో
దొడ్డచెట్లున్నాయి, తరగల
వూగులాడే గాలిచేతా
వూగుతుంటా రోయ్-

అడవిలోనూ కడలిలోనూ
అర్ధరాత్రివేళ అప్పుడు
తొగరుకన్నుల చుక్కకన్నెలు
తొంగిచూస్తారోయ్-

పొద్దుకూకేవేళ పొద్దున
ముద్దుముద్దుగ తిరుగుతూంటూ
సొగసు నడకల గాలిపిల్లలు
సోకుపోతారోయ్-

సుళ్లుతిరిగే కడలినసుమా
చూపుకందీ అందకుండా
తెప్పలేసుకు పాముపడుచులు
తేలిపోతారోయ్-

ఒడ్డునే బంగారుచేలూ
ఒడ్డునే పూవుల్లు చేత్తో
ఊరికే యిట్లంటె చాలేపా
ఉబికి పోతారోయ్-

*

నేనుచెప్పేకతలు జరిగీ
యెన్నినాళ్లయ్యిందో అప్పుడు
మలలు పొదలూ కొండకోనలు
తెలుగునాడంతా.

కడలివొడ్డున పల్లెవొక్కటి
కలదు జే డున్నాడుదానికి
అప్పటికె యీ తెలుగులంతా
గొప్పయేకిమీళ్లా.

వెదురులో ముత్యాలపేరులు
కదురులో దారాల బట్టలు
ఎదురుగా నెలపొడిచినట్లే
వపుమీరేదోయ్-

దొడ్డదొర అతగాడినేలలో
ఎడ్డెపనులే ఛేయ్యరెవ్వరు,
దొంగనాగరికతలో దేశం
తూలిపోలేదోయ్-

ఉన్నవాళ్లకు ఎంతనేలా
దున్నుకుంటే చాలుతుందో
మించిముట్టరు కూడపైనా
చిన్నచెక్కయినా,

కోకిలమ్మ పెళ్లి:

మిగిలినా అడవులు కొండల
కెగురుతూ మబ్బులకన్నెల
తగులుతూ తరిలోన వానలు
కురుస్తుంటాయోగ్ -
అందరికి కావలసినంతా
వుంది యెవ్వరితోడ నెవరికి
నెన్నడూచూడలేమన్నా
చిన్నితగవైనా

*

ఆదారకి కూతుళ్లు ఇద్దరు
మోదుగులు పూశాయి పెదవులు
హరిపేరులు చిలకతల్లీ
కోకిలమ్మానూ.
కోకిలమ్మా నల్లనీదీ
చిలకతల్లీ పచ్చనీదే
చిలకతల్లికి కోకిలమ్మకు
ఎప్పుడూ పడదూ.
చిలకతల్లీ చిన్ననాడే
పలుకమొదలెట్టింది ముద్దుల
మొలకతై తండ్రికీ మేనూ
పులకరించిందీ.

*

ఎన్నొయేళ్లూ వచ్చినాయీ
కన్నులింతగ తెరచినాదీ
పాపమేటూ కోకిలమ్మకు
మాటలే రావూ.
చిలకతల్లికి రంగురంగుల
చీరలూ తెస్తాడుతండ్రీ
కోకిలమ్మను ఊరికేనే
కోపపడతాడూ.

చిలకతల్లీ నవ్వితే
తండ్రిమారూ పలుకకుంటే
తల్లివంకా చూచి కోకిల
తెల్లపోతుందీ.
చిలకతల్లీ వెక్కిరిస్తే
తండ్రివచ్చీ కసురుకుంటే
తల్లివెనుకా దాగిపోతూ
తల్లడిలుతుందీ.
తల్లియేమీ చెయ్యలేకా
తానుకూడా విసుకకుంటే
కోకిలమ్మా లోనలోనె
కుమిలిపోతుందీ.
రోజురోజూ కడలి తరగల
రొదలలో కలసి యేడుస్తూ
నురుగులోపల వట్టి చూపులు
నిలిపిపోతుందీ.
అడివిలో యేచెట్టుకిందో
అంతయెగ్గూ తలచుకోనీ
కూరుచున్నది కూరుచుండే
కుంగిపోతుందీ.
చెట్టుతోనో పుట్టతోనో
చెప్పుకుందా మన్నగానీ
ఎట్టివాడోవాడు నోరూ
పెట్టలేదాయే.
కొండవాగుల్లోను ప్రొద్దూ
గూకులూకూర్చుండి యిసకలో
గూళ్ళులేనీ పిచ్చికలకీ
గూళ్లు కడుతుందీ
కొండవాగులవెంట పోతూ
కొండపువ్వులవంక చూస్తూ

ఎంతపొద్దుపోయినాగానీ
యింటికే పోదూ.
ఒక్కొక్కప్పుడు తెల్లవార్లూ
అడివిలోనే వుండి పోతే
తల్లి ఊరక తెల్లవార్లూ
తల్లడిలుతుందీ. 28
వానరోజులు వచ్చిపోగా
చలిపగళ్లూ సాగిపోగా
ఆకురాలుట ఆగి చివురులు
జోకతాల్చాయీ.
చివురులూ కొమ్మలూ చివరా
గుబురులై గుబురులాచివరా
పూవులూ నాలుగూవైపుల
బుగులుకొన్నాయీ.
చివురులో యీనెల్లె పసిరిక
పూవులో తేనెల్లె పలపల
చిలకతల్లికి కోకిలమ్మకు
వయసు వచ్చిందీ.
చిలకతల్లీ చదువుచూచీ
చిలకతల్లీ సొగసుచూచీ
గాలిపిల్లలుకూడ లోపల
కలతపడ్డారూ.
చిలకతల్లీ అందమంతా
చిందిపోయీ అన్నివైపుల
కనుల చూడనివారుకూడా
అనుకునేవారే.
చెట్లరాణీ తలాడిస్తూ
చిలకతల్లీ వోనుకతలే
నింగిలో దవ్వూన మెచ్చుటా
పొంగిపాడిందీ.

పొద్దుకూకే వేళ తిరుగుతు
పుట్టలోలికే గాలిపిల్లలు
చిలకతల్లీ అందమెప్పుడు
పొలకపోస్తారు.
ఎల్లవారూ చిలకతల్లినె
పెళ్లికై కోరారు, తండ్రీ
తల్లిమాత్రము పిల్లదాన్ని
కివ్వనొస్తారూ.
కడలిఅలవులజెండ్లు తమలో
కలుపుకుంటూ రేము అసుఖుని
గడపదాటీ చిలకతల్లిని
కదలిపోనీరూ.
ఇంటిముంగిలి దాటనీకా
ఇంటిపనులూ చేయనీకా
కంటికీరెప్పాకి మల్లే
కాచుకుంటారూ.
చిలకతల్లీ సొగసువాకలు
చిలపలై పలపలై యెందవు
మొలకలై తేనెలాచినుకులు
గిలపరించాయీ.
చిలకతల్లీ అందమేమో
చిలకతల్లీ పెళ్లియేమో
తల్లితండ్రీ కోకిలమ్మను
తలచనే పోరూ

ఒక్కమధ్యాహ్నంబునందున
చెక్కులందు ఎండలప్రభలవి
పిక్కటిల బ్రాహ్మణుండొక్కఁడు
దక్కడికి వచ్చెన్.

చిలకతల్లీ తల్లితండ్రులు
చేరవచ్చిరి అతనికోసము
కోరినట్టివి యన్నియిచ్చి
ఆదరించారూ.

వేదపనసలు చెప్పుకుంఘూ
వాదముఁకూ కాలు త్రవ్వుఘూ
ఆయనా తెలుగురాజింట్లో
ఆగివున్నారూ.
అతని వేదధ్వనులువింఘూ
ఆతనివర్చస్సుం చకంఘూ
చిలకతల్లీ అతనితనలో
నిలిపివేశిందీ.

సంగతంతా తెలిసి జేపూ
పొంగిపోయాడేమొకానీ
తల్లికీచిలకతల్లంటే
వెళ్లకొచ్చిందీ 45

కోనలందూ అడవులందూ
కోకిలమ్మా తిరుగుతోందీ
ఎంతయేడుస్తోందో తల్లీ
యింటికేరాదూ
ఏమొఅయింగిని నేలవాళ్లో
యింటికొస్తే వాడిమీందా
చిలకతల్లీ వలపు తానూ
నిలపివేశిందీ.

కోకిలమ్మాయింటికైనా
రాకఅడవుల్లోనె తిరుగుతు
పోకిళ్లమార్రైంది తల్లికి
శోకపోయిందీ.

అడవులెంటాకోనలెంటా
బుడబుడాచను సెలలవెంటా
అడుగులూ తడబడా వెదకుతు
నడిచిపోయిందీ.
రెండుజాముల వేళపులులూ
పండుకునిరొప్పేటి నీడల
గుండెగుబగుబలాడ పోయీ
కూతు వెదికిందీ.
పద్దపులులు సివంగులూ ద
ప్పికలుతీరగ నీరుత్రాగే
కొండత్రోవలసెల మొదల్లా
తొంగిచూశిందీ.
అడవిమెకములు తిరుగులాడే
ఎడములేనీఅడుగులొప్పే
అడవిలోపలి త్రోవలెల్లా
తడివిచూశిందీ.
పద్దపులులనుగాడ చంపీ
పీల్చిపిప్పిగ చేసివేసే
అడవికుక్కలు ప్రాకులాడే
పడలు చూశింకి.
లేళ్లనూతిని కొండసిలువలు
కళ్లుమూసుకు నిదరపోయే
పిల్లడడవిలో వుస్సురంటూ
వెళ్లిచూశిందీ.
ఎచటపోయీ వెదకినానూ
ఎందులేదూ కోకిలమ్మా
ఎచ్చటుందో తల్లిగుండె
[illegible]పోయిందు.
ఒక్క సెలయేట్లోకి వెయూ
మిక్కిలీపోయినాముషిణీ

ప్రక్క చెట్టూ క్రిందకూర్చుని
స్రుక్కిపోయిందీ.
తల్లి వెనకాయింత సేపూ
మెల్లగావస్తాండ కోకిల
తల్లిబాధాకళ్ల చూశీ
గొల్లుమన్నాదీ.

ఉరుములా వురిమింది కోకిల
మెరుపులా మెరిసింది కోకిల
వొక్కగంతున తల్లివొళ్లో
వొచ్చిపడ్డాదీ.

తల్లిబిడ్డను బిడ్డతల్లిని
కళ్లుమూసుకు కౌగిలించీ
ఒళ్ళు తెలియక చెట్టుమొదటా
ఒరిగిపోయారూ. 59

*

ఒరిగిపోయినతల్లిబిడ్డా
ఒరిగినట్లె అయిరి గాని
ఒక్కరైనాలేచి కళ్లూ
తెరవనేలేదూ.

తల్లి బిడ్డలప్రేమలంటే
యిల్లాగువుండాలటంటూ
మెల్లిగాపాడింది అడివిలో
పిల్లసెలయేరూ.

తల్లిబిడ్డలప్రేమలంటే
యిల్లాగువుండాలటంటూ
కొసలోనితీగలన్నీ
కదలులాడాయీ.

తల్లి బిడ్డల ప్రేమలంటే
యిల్లాగువుండాలటంటూ
గాలిపిల్లలు వెదుళ్లలో రా
గాలుతీశారూ.

తల్లిబిడ్డలప్రేమలంటే
యిల్లాగువుండాలటంటూ
ప్రకృతిదేవివొళ్ళు తెలియక
పాట పాడిందీ.

*

ఎప్పుడూ గిలకల్లె అడవిలో
ఎచటచూస్తే అచటవుండే
చిన్నికోకిల లేకఅడివీ
చిన్నవోయిందీ

కోకిలమ్మా తానమాడని
కోకిలమ్మా పుక్కిలించని
అడవిలోపలి వూటయేటికి
అందమే లేదూ.

కోకిలమ్మా చివురుకోయని
కోకిలమ్మా పూలుతురుమని
అడవిలోపలిచిన్న చెట్లకు
అందమే లేదూ.

కోకిలమ్మా తిరుగులాడని
కోకిలమ్మా లేనిఅడవీ
కోనలకుతోలుకారుఅందం
కొరతవడ్డాదీ.

తల్లి అంటే అంతప్రేమా
వెళ్లగక్కినకోకిలమ్మకు
చావులేదని మావిచివురూ
సాగులాడిందీ.

తల్లి అంటే అంతప్రేమా
వెళ్లగక్కినకోకిలమ్మా

మునిగిపోదని అడవిపూటా
మూర్ఛరించిందీ.
తల్లిఅంటే అంత ప్రేమా
వెళ్లగక్కిన కోకిలమ్మా
బ్రతికివస్తుందంచు అడివి
పాటపాడిందీ.
ప్రొద్దుకూకేవేళ వెన్నెల
ముద్దుగా కాసిందిజాబిలి
చావు లేనేలేదు ప్రేమకి
చావులేదందీ.
వానలన్నీ వెనకపట్టీ
కోనలన్నీ నీకుపట్టీ
అకురాలే కారుకూడా
ఆగిపోయిందీ.
చిన్నిమొగమున కుంకుమిడినా
కన్నెపేరంటాలిమల్లే
చెలువుగా అడివంతక్రొత్తగ
చివురుతొడిగిందీ
గోదుమా వన్నెత్రాచల్లే
కొబ్బరిపాలల్లె ఆడవీ
చిన్నిపూతాపాదిగిపాదిగీ
చెన్ను వొలికిందీ.
ఎక్కడోఅడివిలోచివరా
చక్కగో సన్నగా యేకో
చిక్కనైనా తేనెపాటా
జీరువారిందీ.
ఆపాట వింటూనె అడివి
అడివిగో నిలువెల్ల పోయిన
వొక్కచుట్టంవచ్చినట్టూ
పులికిపడ్డాదీ.

సన్నగాపోతున్నపూటా
జాలుజాలింత్తై వెడల్పై
పట్టలేకా ఓర్పు జలజల
పరువులెత్తిందీ.
కోకిలమ్మా అదుగోమళ్ళీ
కూసెనంటే కూసెనానీ
వచ్చెనంటె వచ్చెనానీ
బ్రతికెనంటే బ్రతికెనానీ
ఒళ్ళుతెలియక అడవిపూటా
పొర్లిపోయిందీ
చెన్నుతరుగని మావిమోకా
చివురుతొడిగిందీ
అంతలోపల నడవికందం
అతిశయించిందీ.
అంతలోపూవుల్లతేడూ
వింతవింతల సోకులేలిక
చెక్కలా నవ్వులూ చిలుకుతు
చేరవచ్చాడూ.
ఏడాదికొకసారి వస్తా
జేడాదికొకసారి తెస్తా
చెన్ని పువ్వులు అతనివేనూ
వన్నెలూచిన్నెల్.
వచ్చావటయ్యా పూలతేడా
తెచ్చావటయ్యా పూలరాజా
నీవుతెచ్చిన పూవులేకా
నికల కిస్తామూ.
కోకిలమ్మను ముద్దుపెళ్లీ
కూతురును చేస్తాము పెళ్లీ
కొడుకునూ చేస్తాము నిన్నూ
కూర్చివేస్తామూ.

కోరినీఅందానికి మా
కోకిలమ్మ గొంతుకునకూ
సొగసుచేతా పాటచేతా
తగే పోయిందీ.
రావయ్యా ఓపూలరాజా
రావయ్యా ఓఅందగాడా
కోకిలమ్మకు నీవు నీకూ
కోకిలా తగునూ.
వారిపెళ్లికి అడివిఅంతా
తోరణాలైనాయిచివురులు
కాపలాకాసినై పులులూ
గండశిలలందూ.

సన్నాయిపాడింది తెల్లని
సన్ననీసెలవూట పూలా,
వెన్నలై ప్రకృతి తల్లేమో
కన్ను తెరిచిందీ.
పూలసోనలు కురిసినై, తే
నేలపాటలు పిరిసినై, అం
దాలత్రోవలు వెలిసినై, రాజ
నాలు పండినవి.
చిలక తల్లి మహోత్సవంబున
నిలచినవి సాంస్కృతిక వాక్కులు
కోకిలమ్మా తెనుగుపలుకూ
కూడబెట్టిందీ.

విశ్వనాథ సత్యనారాయణ.

# సంజయరాయబారము.

కవిబ్రహ్మ తనభారతములో సంజయప్రతిభను మిక్కిలి సమర్థతతో సృష్టించియున్నాడు. సర్వశాస్త్రపారంగతుడును, వేత్తయు, రాజనీతివిదుడు నగునట్టి మహాత్ముడే సంజయపాత్రను స్వీయముగ ధరించి ప్రదర్శించినట్లు గనుపడుచున్నది. ఈ సూతవంశజాతుడు గాకపోయినా తన ధీశక్తిచేత రారాజుయొక్క సభలో గౌరవస్థానమును వహించి ధృతరాష్ట్రచక్రవర్తికి చెలియై, అంతరంగిక సచివుడై కౌరవరాజ్యరథమును భీష్మవిదురులను దీటుగ నడిపి యున్నాడు. కౌరవరాజ్య నౌక తుపానులో చిక్కుకొని క్లిష్టపరిస్థితులలో నుండగా సామోపాయమున దానిదరి జేర్చుటకు వలయు నుపాయము గల కర్ణధారు డితడేయని విశ్వసింపబడుట యాతని భాగ్యముగదా! పాండవపక్షమున శౌర్యమునకును ఖడ్గమునకును దీటయి, ఆకాలపు రాజ్యతంత్రజ్ఞుల కెల్ల మేటియై, శ్రీకృష్ణు డున్నాడు. ఏకాలమునందును ఎవ్వరికిని తీసిపోని కార్యచతురుడు ధర్మరాజు. ఈయిరువురు దిట్టలను డీకొనుట కర్హుడని ప్రజ్ఞాచక్షుడగు ధృతరాష్ట్రునిచే బంపబడినవాడు సంజయుడు. ఇక వేరు యోగ్యతాపత్రము లెందులకు సంజయునికి?

సంజయునియెడ పాండవుల కెట్టి యభిప్రాయము గలదో విచారింతము. ఇతడు శ్రీకృష్ణునకు విస్తుడు. ఈతని 'లెస్స పేరం'బర్జునునకు నచ్చినది. ఉభయులును ప్రేముడిగల బాలసఖులట. మఱియును ధర్మజునితోడి రాయబారము ముగించిన వెనుక, సెలవు గైకొనుచు సంజయుడు 'నే నాడిన మాటలలో గలుగు లోపముల సైరింపుము' అని వేడుకొనగా ధర్మజు డాడిన మాటలు గమనింపదగును:-

గీ. పోయివత్తుగాక - యీయన్నయందఱు
వినగ నాడి తీవు - విశదభంగి
నొక్కమాట యయిన - నుచితంబుగానిది
గలదె యిట్లనంగ - వలయు నెట్లు?
ఎదురున్నరూపు పలుకగ
మది గటకటబడవు నీవు - దుర్ణయమును బె
ట్టిదమును బెండును నగు పలు,
కొదవదు నీనాలుకను న - యోన్నత యెపుడున్.

క. నీవొండె విదురు డొండెను
గావలయుంగాక యిట్టి - కార్యంబులకున్
రా వేఱు కలరె తగువా
రీవినయము నేర్పుగలదె - యితరుల కెందున్.

సకలధర్మవిజ్ఞుడైన ధర్మజుని మనమున కెక్కునట్లుగా మరుములుగాక జిల్లిబిల్లులు లేక మాటలాడి జయప్రదముగ రాయబారముల జరిపి స్వామికార్యమును నిర్వహించుకొన్నాడు.

సంజయుని రాయబారమునకు బంపునప్పు డున్న పరిస్థితుల ముందుగ దెలిసికొనవలసి యున్నది. జూదంబునకు పూర్వము కౌరవపాండవులు పైతృకమయిన రాజ్యమును చెరిసగంబుగా బంచికొని

కుడుచుచుండిరి. మొదటి జూదములో పాండవులు తమభాగము నోడిపోగా, కల్లోలముల నడచుటకై ధృతరాష్ట్రుడు వారిభాగమును తిరిగి యిచ్చివేసెను. పునర్ద్యూతములో నోడిపోయినవారలు అజినవల్కలంబుల గట్టి, కందమూల ఫలాశనులై బ్రహ్మచర్యంబునం బండ్రెండేండ్లు వనవాసంబు నొక్క యేడజ్ఞాతవాసంబును జేసి యందెఱింగంబడిరేని వెండియుం బండ్రెండేండ్లు వనవాసంబును నొక్కయే డజ్ఞాతవాసంబు సేయవలయు నని నిశ్చయింపబడెను. ఓడిపోయిన వారి రాజ్యమేమి గావలయునో అందు జెప్పంబడలేదు. పాండవులు తమరాజ్యము నెవరికిని ఒప్పగించ లేదు. ఒకరిని బెట్టి యేలించుకొనలేదు. తమకుగానిది యేమయినను సరియే యని యూరకుండి యుందురు. లేక పరులనుభవించుటకంటె బంధువులనుభవించుటయే మేలని తలంచి యుండవచ్చును. వనవాసము అజ్ఞాతవాసము ఎట్లో గడపబడినవి. ఉత్తరగోగ్రహణసమయమున అర్జునుడు గుర్తింపబడెను. అప్పుడు దుర్యోధనుడు భీష్మాదులం జూచి, 'యీపదుమూడవయేటి కొఱంత గలుగం బార్థుండు దన్నెఱింగించి కొనియె, ఎక్కువ తక్కువలు నిరూపించి భీష్ములు దీని నిశ్చయింప నర్హు' లని చెప్ప, భీష్ముడు—

సీ. కెండకయేటనొ - క్కండు దధిమాస మి
ల్లెక్కనయన్నెల - లెల్ల గూర్చి
కొన బదుమూడుహాయనములు దప్పక,
నిన్నటి తోడన - నిండె యంత

అని నిర్ధారణ జేసెను. కాని యీతీర్పును దుర్యోధను డంగీకరించినట్లు గనుపడదు. పాండవుల పక్షమునుండి రాయబారిగా వచ్చిన ద్రుపదపురోహితునితో కర్ణుడు—

గీ. దీనసేమి తప్పు కొనకు నేగిన
యతడు సమయవృత్తి నాక్రమించి,
తండ్రిపాలు మాకు-దగునంచు నడియని
తనము చేసిరాక తప్పుగాక.

యని జూపి చెప్పగా, భీష్ముడు మరల

క. నరులాలవెనుక వచ్చిన
గురురా జడుగంగ నీవు-గురుడును గృపుడున్
గురునుతుడు వినగి వారల
చిరసమయము గెలుట-యేను జెప్పనె దెలియన్.

అని ఉత్తర మిచ్చియున్నాడు. ఇది యట్లుండె.

ఉత్తర వివాహ మయిన వెనుక విరాటుని మందిరమున బంధుజాలమంతయు సభ జేసి భావికర్తవ్యమును చర్చించిరి సాత్యకి సహదేవుడు మున్నగుయువకులు ఖడ్గవాదము గావించిరి. ద్రుపదుడు బలరాముడు మున్నగువృద్ధులు కార్యవాదము ననుసరించి, సామోపాయమున కార్యము సాధింపవలయునని నిశ్చయించి, ద్రుపదపురోహితుని రాయబారిగా బంపిరి. అప్పటికే సమరసన్నాహము చాల వరకు పూర్తియయ్యెను. భారతవర్షములోని రాజు లెల్లరును ఏడక్షౌహిణులు పాండవపక్షమునను, పదునొకండక్షౌహిణులు కౌరవపక్షముననుగా ఉభయపక్షముల జేరియుండిరి. అయినను ద్రుపదరాయబారము యొక్క ఉద్దేశమును విరాటునిందుసభలో శ్రీకృష్ణుడిట్లు చెప్పియున్నాడు

‘ఇది యిక్కడి కార్యంబునకుం బోచిన తెఱంగు. అక్కడివారి చిత్తవృత్తి యెట్టి దగుట యెఱుంగము. ఎదిరి తలం పెఱుంగక యది కార్యంబని నిశ్చయింపనగునే. కావున నియ్యవసరంబునం

గూడి మనుట కియ్య - కొనవేరరైనను
ధర్మజుండు గలఁడు - తగవునడఁప.

క. నెయ్యము వాటించి కదుఁ
దియ్యమెసఁగ బలుక లెల్ల - దీరదు నటుగా
గయ్యమును దెలుపులోనుగ
నయ్యమలిందనుడు మాను నట్టి తెలుగుగన్.

వ. శాంతి ప్రకారంబునం గార్యంబు నడపి యొక్కటియై మనుట యొడఁగూర్పవమ్ము. రథం బెక్కి పొమ్ము.

ఇందులో పాలిచ్చుమాటలేదు లేదనియు జెప్పడు. యుద్ధముమాన్పి కలిసియుండున ట్లేర్పాటు జేయవలయునట. పాండవులను సహితము తనబిడ్డలుగ జూచుకొనును. దుర్యోధనుఁడు రారాజు గనుక తనతక్కిన కుమార్లవలెనే పాండవులును వారితో గలిసి సుఖముగ జీవించవచ్చును. అనగా రాజకుమారులవలె అన్నవస్త్రములకు లోపములేక రాజోపచారముగ జీవించవచ్చునని యర్థము. దుర్యోధనాదులు బ్రహ్మణునితో భాగము లేదని చెప్పివైచిరి; గాని సంజయరాయబారమునకు మాత్రమిద్ది రాలేదు.

ఇట్టు పాండవులసంగతి యోచించితము. బ్రాహ్మణుడు తిరిగిపోయి దుర్యోధనాదులు భాగమిచ్చు నుద్దేశముతో లేగనీయు, భీష్ముడు కోపించి చెప్పినను ప్రయోజనము లేకపోయెననియు చెప్పియుండును. అందుచే సంధియగునను ఆశమాత్రము విడిచి ధృతరాష్ట్రుడు బంపురాయబారికై వేచియుండరు. అందుచేతనే పాండవపక్షమున సంజయునితో మొదట యుద్ధప్రసంగమే జరిగినదిగాని సంధిప్రసంగము జరుగలేదు.

సంజయు డుపప్లావ్యపురమునకు వచ్చి, మొదట శ్రీకృష్ణార్జునుల సందర్శించెను. వారాతని సమాదరించి కార్యము విన్నవించగా అర్జునుడుత్సాహముతో ప్రత్యుత్తర మీయబూనుకొనుటయు, కృష్ణుడాతనివారించి, కౌరవులకంత్యకాల మాసన్నమయిన దనియు వారందఱును అంత్యకోర్కెలను తీర్చుకొని మరణశాసనముల వ్రాయించి యుంచుకొనవలయు ననియు, తీక్ష్ణమయిన ప్రతాపవాక్యములతో ప్రత్యుత్తరమిచ్చెను. మరునాడు ధర్మరాజు సభగావించి రాయబారము వినిపింపగోరెను.

ధృతరాష్ట్రుడు మీయందఱి క్షేమము మొదట విచారించె నని చెప్పగా, ధర్మజుడు ద్వంద్వార్థముగా మా పెదతండ్రియొక్క కృపాతిశయముచేతనే యిప్పటి కీవిధముగ నున్నామని చూపి చెప్పి, తిరిగి యాయందఱి యొక్కయు కుశల ప్రశ్నమడిగి వరుసగా నీక్రింది ప్రశ్నములడిగి, యక్కడి సంగతులు విచారించెను.

1. ద్రోణకృపాశ్వత్థామలు సుఖముగ నున్నారా ?
2. భీష్మునికి క్షేమమా? కౌరవు లాతనిమాటలను గౌరవింతురా ?
3. బ్రాహ్మణవృత్తుల నిలిపి వారిని మన్నించుచున్నారా ?
4. గడిదేశములరాజులతో కలహములు లేవుగదా ?
5. ఘోషయాత్ర కురుకుమారులకు జ్ఞాపక మున్నదా ?

6. అనిలో నర్జునసైన్యధరోక్కని కౌరవులు బ్రతికిపోవుట సాధ్యమా?

7. కౌరవులు కర్ణునిమాటపట్లనే యున్నారుగదా ?

ఈప్రశ్నల కన్నిటికిని సంజయుడు సరియయినప్రత్యుత్తరము లిచ్చెనేని కౌరవరాజ్యమురొక్క గుట్టుమట్టంతయు బయల్పడును.

1, 2, 3 ప్రశ్నల వలన కౌరవులలో నేకాభిప్రాయములు లేక,అంతఃకలహములు మెండుగ నున్నవనియు, దేవబ్రాహ్మణ వృత్తులు నశించుచున్నవనియు, మహావీరు లగుపెద్ద లెవ్వరును కౌరవపక్షమున నుత్సాహముతో యుద్ధము చేయరనియు, తేలగలదు. నాలుగవ ప్రశ్న వలన గడిదేశములనున్న అడవిజాతులు రాజ్యముపై దండయాత్రలు జరిపి జనులను బాధించు చుండుటచే, కౌరవులు ప్రజానురాగము వడయలేదని స్పష్టమవును. 7 వ ప్రశ్నవలన పురోహితుడు రాయబారమునకు వచ్చినప్పుడు దుర్యోధనాదులకు ప్రతినిధిగా కర్ణుడే రాజ్యభాగ మిచ్చుటలేదని చెప్పియుండుటచే వారు భీష్ముని మాటపట్లలో లేక, కర్ణునినాయకత్వమున నుండుటచేత, సంధిపొసగక యుద్ధమె సంభవించు ననియు, 5, 6 ప్రశ్నలవలన తమకే తప్పక విజయము చేకూరుననియు తెలిసికొనవగును. ఈప్రశ్నలకు సంజయు డిచ్చినప్రత్యుత్తరములవలన నాతని చాతుర్యము గ్రహింపదగును.

సంజ:- కౌరవపక్షమున దుర్మార్గులును సన్మార్గులును గలరు. పెద్దలు చెప్పినను దుర్యోధనాదులు వినుటలేదు- దుర్మార్గులమీద కోపముచే నీవు యుద్ధము ప్రారంభించితివేని, నీవనిన ప్రకారమే నీవు గెలుచుటయే నిశ్చయము. అందుచేత దుర్మార్గుల మూలమున పెద్దలుసహితము చావవలసివచ్చును. అయినను నీవు కృపాళుడవయి సంధిసేయ నిశ్చయించితివి. గనుక వారందఱికిక క్షేమముగనే యుందురని ముందఱ కాళ్లకు బంధమువైచి జవాబిచ్చినాడు. ధృతరాష్ట్రుని దుశ్చరితమే మీయిప్పటి దుస్థితికి కారణమందు వేని అదియును క్షంతవ్యమె. అతడు స్థిరచిత్తుడుగాక పోవుటచే కొడుకుల దుశ్చరితమును మాపలేక పోయెనుగాని ఇప్పుడతడు పశ్చాత్తప్తుడై శాంతచిత్తుడై యున్నాడు. మీరాతనితో సంధిచేసికొని కలిసి మెలిసి యుండినచో, నతడు మునుపటివలె దుర్యోధనాదుల దుర్వ్యవసాయములను సాగనీయడు. నీయజాతశత్రుత్వ నామమునకు దగునట్లు, వారు మునుపుజేసిన యపకారముల నన్నిటిని మఱచిపొమ్మని ప్రార్థించెదను. మీరు దేవబ్రాహ్మణుల కిచ్చిన వృత్తులు కౌరవులు నిరాటంకముగ జెల్లించుచున్నారు. దాని విషయమై నీవు విచారము పెట్టుకొనవసరములేదు. మీపరాక్రమము లోకవిదితము. మీరు మహాపరాక్రమశాలులయ్యును శాంతాత్ములగుటచే యుద్ధమునకు గడంగరని జనులు చెప్పుకొనుచుందురు- అని చెప్పి మీరందఱు వినగా కొలువులో జెప్పుమని మీతండ్రి వచించినపలుక్కలు గలవు., సావధానముగా వినుడని కోరగా ధర్మరాజు ఈపలుకు ప్రియములకు గినిసి, అయ్యా ఇరుగో నాతమ్ములు. ఆయన కృష్ణుడు. వీరు నాబంధువులు. తండ్రి నిన్ను జెప్పుమన్నదంతయు వినుటకు సావధానముగనే యున్నారు. అని ఎఱుగని వానితో జెప్పిన పేర్లవరుసగా జెప్పి గంభీరించి యూరకుండెను.

అంత సంజయుడు ధర్మరాజుయొక్క గంభీరవాక్యములచే నధియెడ గొంత నిస్పృహజెంది పైకి గనబడనీయక మరల నిట్లని సందేశముం జెప్ప ప్రారంభించెను.

సం:—"అయ్యా సావధానులరై వినుడు. ధృతరాష్ట్రుడు సంధికార్యమునెడ మిగులనాసక్తుడైయున్నాడు. నాప్రయాణమునకై రథము నాయన స్వయముగ నన్నించినాడు. జగడమువంటి తేలికవస్తువు కొఱకుగాను పట్టియుదాతు అంతఃహింపను. దుర్యోధనుని వలన మీవంశమునకు గలిగినయపకీర్తిని

నీవ పాపపలయు. సమరము జనక్షయమునకు గారణము. గెల్చినను ఓడినను దుఃఖమే యగును. వృద్ధులను బాలురను సఖులను బంధువులను గురువులను జంపి పడయగలసుఖములు దయామయుడవయిన నీకేపాటి రుచించును ?

అదియును గాక — నీవు యుద్ధమున కంగీకరించవుగాని కృష్ణభీమార్జునాది మహాయోధసంపన్నుడవైన నిన్ను గెల్చుట దేవతలకయినను సాధ్యమా ? భీష్మద్రోణకర్ణాదులం గూడిన దుర్యోధనుని జయించుట కెవరితరము? ఇట్టి మీకు అన్యోన్యకలహము మేలుగాదని పక్షపాతము లేనివా రెల్లరును జెప్పగలరు. అయ్యా! క్రోధము శాంతింపుము. దానికి భీష్ముండును సర్వలోకంబును సమ్మతించును.”

దానికి ధర్మజుడు:— సంజయా! ఎందుకు నీకీ ఉలుకు? నేను యుద్ధముదక్క మఱియొక దిక్కుగ లేదంటినా? పోరాటము లేక కోర్కెలు ఫలించెనేని వెఱ్ఱివాడైనను పోరున కుత్సహించునా? ధనతృష్ణాపీడితులు కామపూర్తికై దుష్కర్మము లాచరింతురు; కాని ఉచితములయిన సౌఖ్యముల గోరునట్టివారు దురంతములకు జొత్తురా? పెనకువలు సంతాపకారులుగాక సుఖావహములా? తండ్రి రాచివ్వాముల మాకుమాత్ర మేల యొసంగడు? వెనుక తా నవినీతుడై వర్తించినను ఇప్పుడు మమ్మునైనను న్యాయమున వర్తించుమని బుద్ధిజెప్పుట యుక్తమెకదా? ఎవటివారును మనయట్టివారని భావించినసే సంధిపొసగును గాని “మాకు కుడుము. మీకుమాత్రము తుంపు” అనుపద్ధతి ననుసరించినచో మనసులెట్లు గలియును? అదిగాక ఎందుకు నీవు మమ్ములను ‘సంధి- సంధి’ యని వేధించెదవు? ధృతరాష్ట్రుడు మనకు క్రొత్తవాడా? హీనస్థితియం దున్నమమ్ము రావించి రాజ్యము చదివించుటకు ఆయన వెఱ్ఱివాడుగాడు. నీవును పక్షపాతము లేనట్లు మాట్లాడి ముందు మాపరాక్రమము బొగడి వెంటనే వారిని జయించుట సాధ్యము కాదని చెప్పితివి. ఉభయుల బలాబలములను అర్జునుని గాండీవమును భీముని గదయునే నిర్ధారణచేయగలవు. ఆసంగతి నటుంచి, బుద్ధిమంతుడవు-నీవువచ్చి కోపోపశమనంబుగా బల్కితివి. ఇదివఱకు వారి నేరముల నన్నిటిని సైరించితిని. ఇంకను సైరింతును. మాతండ్రి మమ్ముల బిలిపించి మాభాగపురాజ్యమిప్పించి ఇంద్రప్రస్థమో లేక మఱియొక పట్టణమో మాకు రాజధానిగ నేర్పరుపుమనుము. అంతటితో అన్నిచిక్కులును దీరును.”

• పైరెండు సంభాషణల సారాంశ మిది. దయామయుడవై యుద్ధమాపవలసిన దని సంజయుడు ప్రార్థించినాడు. భాగముసంగ యొత్తుకొనలేక; సరే యుద్ధము నాకక్కఱ లేదు. రాజ్యభాగము మాత్రము తప్పక యిప్పించు మన్నాడు ధర్మరాజు. ఇంక మఱి వాదమున కవకాశము లేదు. సంజయుని మంత్రము పూర్తిగ పారలేదు. అంతట—

సంజయుడు.— రాజా! నే నింత సేపు జెప్పినను నాకింకను తృప్తి గలుగలేదు, నీవు వినువు లేనివాడ వగుటచే మఱల నొక్కింత జెప్పబూనితి. అయ్యా! నీవు రాజ్యభాగమును గోరితివి. అహింసాధర్మమును అనింద్యచరిత్రయునే నీరాజ్యములు. మఱి యింకొక రాజ్యము నీకెందుకు? కౌరవులు దుర్మార్గులై పంచి యియ్యనిచో, నీవు యుద్ధము జేసి గెల్చి, నెత్తురు కూడు దినుట కంటెను బిచ్చమెత్తుకొనుటయే మీనుచరితమున కనువైయుండును. క్రూరకర్మమొనర్చుట కిష్టము లేకయే కదా పన్నెండేండ్లు వనవాసంబును ఒకయేడజ్ఞాతవాసమును సల్పితివి. ఇప్పుడు యుద్ధమునకు దిగి, యిదియంతయు వృథ జేయుదువా? రాజసూయాధ్వరముచే దేవబ్రాహ్మణుల తృప్తిపఱచి శమదమాదులబడసిన పుణ్యమూర్తివి. నీ స్వచ్ఛచారిత్రమునకు హింసాకళంకమును బట్టనీయకు. జూదరులైనదుర్మార్గులనే

రాజ్యమును నెత్తిన గట్టుకొననిమ్ము. గురువులను వెదకి వెన్నాడి పట్టి గొంతులు గోయుదుము. కోపము నడచుకొమ్ము.

ధర్మరాజు.—సంజయా నీవు చెప్పినది నే కాదనను. కోపము నివారింప దగినదియు అహింస ఉత్తమ ధర్మమనియు నే సంగీకరించెదను, వంశదూషకులను లోకకంటకులను నిర్మూలము గావించుట ధర్మమని పెద్దలు చెప్పుదురు. క్షత్రియులకు సంగ్రామము ధర్మమవునో కాదో నీవే నిర్ణయింపుము. మనకీవితర్కముతో నవసరము లేకయే కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయింపగలవాడు వాసుదేవుడు గలడు.—అనిన విని జనార్దనుడు సంజయున కిట్లనియె.

కృష్ణుడు—నేనెప్పుడు పాండవుల శుభము గోరెదను. పుత్రపౌత్రులతో నొప్పు అంబికేయునకు చేటు రాకుండుగ కయనియు తలంచెదను. నీవు రాయబారమునకు వచ్చుట నాకుసంతోషము; కాని ధర్మరాజుయొక్క మాటలు సంధికవకాశ మిచ్చునట్లు తోచవు. ధృతరాష్ట్రుని తియ్యని మాటలకు ధర్మరాజు సంతసించు వాడు కాడు. కౌరవులతో కలిసియుండుట కాయన యంగీకరించినను మేలే. లేకతమ తండ్రి పాలిమ్మని యెత్తివచ్చినను తప్పుగాదు. అవమానపు బ్రతుకుతో అహింసాపరులని పేరొందుటకంటె ప్రతాపమును జూపుటయే మేలు. క్షత్రియులకు సంగ్రామము కులధర్మము. పరాక్రమవంతులు ఇచ్చువారేకాని వేడుకొనువారు కారు. తమ న్యాయార్జితధనమును ఒరు లపహరించినప్పుడు ఊప రొయాగించుకొనుటకేకదా శస్త్రాస్త్రములు నిర్మింపబడినవి. అది యట్లుండె. వాడు కొలువులో ద్రౌపది కొదవినమాన భంగమునకు నీవేమి చెప్పెదవు?

సం.—ఈసంధిమాటలసమయమున నది తలంపునకు రానిచ్చినచో కార్య మొనగూడుట దుర్ఘటము,

కృ. సంజయా! అదివాలక కర్ణుడు కూతిమికల ముత్తియొక మగనిని వెదకికొమ్మని పాండవపత్నికి చెప్పెను.

క. నరునకు నది వాఙ్మయ మగు
శరమై హృదయంబునాటి చలియింపక ద
ర్భగ వేదన జేయంగా
చిరకాలము తచ్చికిత్స - చేసెనె చెపుమా !

దుశ్శాసను టిస్నట్లె వీరుగొడ్డువోయిరి కాని వీరిపౌరుషంబు వలన వారికి నేమిఫలించెని కౌరవ సంధికార్యం బత్యంత దుర్ఘటంబని తలంచెద. అయినను పాండవేయుల నెట్లయినను ఒడంబరిచి నేనే అచ్చటికి వచ్చి కౌరవులకు బుద్ధి జెప్పి. సంధి కొడంబరుప జూచెద. వారన్యాయమైన సాయోర్పాటున కొడంబడి పాలీయనిచో పాండవ బాణాగ్నిచే గాక వారిలోభమను చిచ్చుచేతనే దహించుకొని పోదురు.

క. ఏ నీపని కైవచ్చెద
తానొప్పదలంచెనొండె - దప్పదలంచెన్
దానన నెగడెడవమే మ
మ్మానవనాథునకు జెప్పుమా చుత మెల్లన్.

అ. అనిన విని సంజయుడు ధర్మతనయునితో అట్లయినఁ గడుతెస్సగదా! నావచ్చినకార్యంబు సఫలం బయ్యెగదా! పోయి వచ్చెద ననియెను. ధర్మరాజు సెలవిచ్చుచు చివరకు సంధి విషయమై

సంజయరాయబారము.

మమ్ము శైశవంబున మాతండ్రి రాజ్యపీఠమున నిల్పి ప్రభుత్వమిచ్చి ప్రోచి పెరిగించితివి. ఇప్పుడుపేక్ష చేయుట న్యాయ్యమా ? కౌంతేయాగ్రజుడు యుద్ధము పొంత బోనొల్లడనియు, శత్రులను అధర్మవృత్తికిని చావునకును దప్పింపు మనియు పితామహునకుం జెప్పుము. ఇతరులు సుయోధనునడ్డంబు జెప్ప చొరమింజేసి పెద్దవాడనయిన నా మాటలుగా వానికి దెలుపుము. తగవులు లేక మన మన ధనంబు లనుభవించి సుఖంబుండుటమేలు. ఎక్కువ యియ్యనొల్లనిచో కుశస్థలంబును వృకస్థలంబును వాసంతియు వారణావతంబును ఇంద్రప్రస్థంబును చాలును. దానికిని ఇయ్యకొనడేని ఎందేనియు నొక్కటి యగునట్లుగా తనతోఁబుట్టువుల మేపురము నిలుచ తావు లయినిచ్చి సఖ్యశాంతి యగు.

ధర్మరాజువలన నిట్టిసరసములయినమాటలను సంపాదింపఁగలిగిన సంజయునిరాయబారము సఫలంబె గదా! సుయోధనుడు వీని కంగీకరింపని దోషము వానిదియే యగును.

వున్నవ లక్ష్మీనారాయణ

# శ్రీ సీతారామాంజనేయ సంవాదము.

ఏ భాషయందైనను కొన్ని గ్రంథములకు ఎక్కుడు గౌరవస్థానము ఉండుట సహజము. అట్టి గ్రంథములను ఆభాషను మాటలాడువారు అత్యధికమైన పూజ్య భావముతో చూచుకొనుచుందురు. ఒక పర్వతముయొక్క ఉన్నతి దానిశిఖరములపై నాధారపడినట్టు, ఒక సారస్వతముయొక్క గొప్పతనము అందులోగల సుప్రసిద్ధ గ్రంథములపై నాధారపడియుండును. వస్తుగౌరవము కాని, రచనావైదగ్ధ్యము కాని, రసోత్కృష్ట్యము కాని, ఆగ్రంథములకు అట్టి ప్రసిద్ధి కలుగుటకు హేతువులు కావచ్చును. ఏమైనను ప్రతిజాతివారికిని తమ సొంత సొత్తువలె ప్రత్యేకాభిమానముతో చూచుకొని గర్వించదగిన గ్రంథరాజములు కొన్ని తప్పక ఉండితీరును. వేదవేదాంగములు, రామాయణభారతాదిమహాకావ్యములు ఆర్షసంప్రదాయకులకును, బైబిలు షేక్సుపియరునాటకాదులు పాశ్చాత్త్యులకును అట్టివి.

ఆంధ్రులకు గూడ అట్టి గ్రంథములు లేకపోలేదు. తిక్కనభారతము పోతన భాగవతము, ఆంధ్రసారస్వత ప్రపంచమున సూర్యచంద్రులవంటివి. ఇట్టి వింకను పెక్కులు గలవు.

మన తెనుగు భాషలో ఈజాతికి చేరినగ్రంథరాజ మొకటి కలదు. అది శ్రీసీతారామాంజనేయ సంవాదము.

మోక్షవిద్యను ప్రతిపాదించు గ్రంథములు— అందులో స్వకపోల కల్పితములు (అను వాదములు కాక)— ఏభాషకయినను అమూల్యార్థము లనుటకు సందియము లేదు. జ్ఞేయము లగు సమస్తపదార్థములలోను మాహాత్మ్యోత్కృష్టమైనది "ఆత్మస్వరూపము." అట్టి "ఆత్మజ్ఞానమే" పరమప్రయోజనము గాగల మోక్షశాస్త్రము శాస్త్రరాజ మని వేరుగ చెప్పవలెనా ?

సంస్కృతమున "ఆత్మతత్త్వమును" ప్రతిపాదించు గ్రంథప్రపంచము అపారముగా కలదు. దానిని ప్రశంసించుటకు నాకు అవకాశము గాని, అధికారము గాని, ఏమాత్రమును లేదు. కాని సంస్కృతమున బ్రహ్మసూత్ర భగవద్గీతాది

గ్రంథములవలె ముముక్షువులు, గీర్వాణభాషానభిజ్ఞులు పారాయణించి ఆత్మవేత్తలై తరించుటకు సాధనభూతము కాగల గ్రంథము ఆంధ్రమునందు కలదా యనిన నది యీ సీతారామాంజనేయ సంవాదము.

మోక్షశాస్త్రము ఎంత ఉత్కృష్టమైనదో, అంత దురవగాహ్యమైనది. దానిని సాధించుట సంసారమును సాధించుటయే! అందులో నతినిశితమును, అతి బహుళమును, అగు తర్కమునకుగూడ లొంగక, బహుపుణ్యపరిపాకవశమున లభించిన సంస్కారవిశేషముచేతనే కొంతకుఁ గొంత స్వాధీనము కాఁదగినది ఈ మహావిద్య. కావుననే అధికారితారతమ్యమును గమనించి మహానుభావులు బ్రహ్మసూత్రాదికము లుండగా ఇతిహాసనాటకాదుల ముఖమున సామాన్యులకును సుగ్రాహ్యముగను, ఆస్వాదనీయముగను చేయుటకయి గీర్వాణభాషయందు విశేషముగా కృషిచేసిరి. అట్టి మహావిషయమును ఆంధ్రభాషలో వ్రాయుచు మన సీతారామాంజనేయసంవాదకర్త ఎట్టి అతిలోకప్రతిభను, అమోఘకల్పనా వైదగ్ధ్యమును, చూపినాఁడో వివరింతును.

'వ్యుత్పత్తి మాత్రప్రయోజనమైన శాస్త్రమును ఛందోబద్ధముగా వ్రాసిన నది కావ్య మగునా! పద్యములలో కూర్చిన గణితశాస్త్రాదులకు కావ్యతాసిద్ధి కలుగునా!' అని ఒక సందేహము. కలుగదు నిజమే. కాని విషయ మెట్టిదైనను ఎంత శుష్కభావమైనదైనను దానిని ఉక్తి వైచిత్ర్యముచే రచనాచమత్కృతిచే అతిరమణీయముగా భాషయందు చిత్రింపగల శిల్పమున సిద్ధహస్తుడైన కవీశ్వరుడు వ్రాసిన నది కవిత్వము కాదనుటకు వీలుండునా? అట్లు వ్రాసి "ఇది కవిత్వమే" నని సహృదయలోకముచే ప్రశంసింపబడిన కవులు ఎందరోకలరు. అట్టివారిలో ఉత్తమస్థాన మలంకరింపదగినవాఁ డీగ్రంథకర్త. అసలు వేదాంతమువంటి తర్కవిషయము కవిత్వసామగ్రి కాదగునా? అట్టిది జిజ్ఞాసువులకే కాని రసార్థులకు రుచించునా! యనిన "సాధ్యమే! రుచించును" అని ఈగ్రంథము ఒకసారి చదివినచో ననిపించును. నాదబిందుకళావివరణము; ఆత్మానాత్మ విచారము, దృగ్దృశ్యనిరూపణము, అవధూత స్వభావవర్ణనము మొదలగు ఘట్టములలోని కవిత్వమును చదివి చూచిన ఇది శాస్త్రమా? కావ్యమా? అని ఆశ్చర్యమును ఆనందమును కలుగును. పద్యములో నున్నది క్లిష్టతర్కమే యగుఁగాక. పద్యముమాత్రము ఎన్నిసారులు చదువుకొన్నను విసువు జనింపక గమనమనోజ్ఞముగా నుండును. ఏదియో యొకతీరయిన అలంకార వైచిత్రి లేనివృత్తమే కానరాదు. 'ఏమిలోకోత్తరప్రజ్ఞాధను డీకవి!' అని తన్మయత్వమున మునిగిపోదుము. వైరాగ్యరసోద్రిక్త చిత్తుడై "ఆంధ్రావని మోదముం బొరయ" లోకసంగ్రహార్థము ముముక్షుజనోద్ధరణార్థము, అత్యంత మనోమోహనముగా వ్రాసినాడు కవి ఈమహాగ్రంథమును. కవి తన బ్రహ్మసందోద్రేకమును ఎన్నిచోటులలోనో వెలువరచినాడు. కళాదృష్టితో

చూచిన ఈగ్రంథమునందలి సీసములు, గీతములు, చదివియే మెచ్చుకోదగినవి. వేదాంతవిషయ విముఖునకుగూడ ఇందలి కవితారీతి వైద్యుని పంచదారలో పొదుగబడిన చేదుమాత్రలవలె తదభిరుచిని యొదవించి తీరును.

ఈగ్రంథము తత్త్వముపదేశించుచో ప్రభువువలె గాక, మిత్రునివలె గాక, లలితభాషణభూషితబహువిలాసిని, మృదుమధురాలాప, చతురగమన, సుప్రసన్న భావ, సమగ్రసౌందర్యరాశి అగు ప్రియురాలివలెనే ఉపదేశించును. ఈ గ్రంథమున ప్రసాదమాధుర్యములు ఆద్యంత విలసితములు.

ఆంధ్రుడైనవాడు ఈమహాగ్రంథమును పఠించి తన జన్మమును ధన్యము గావించుకొనవలెను. దీనికి మన ఆంధ్రసంసారములో ఎంతయేని ప్రాముఖ్యము కలదు. సంస్కృతపరిజ్ఞానము లేనియో గులకు, ఆత్మజ్ఞానసువులకు ఇదికల్పతరువు వైరాగ్య పథ ప్రవిష్టులైన ఆంధ్రపూర్వసువాసినులు ఎందఱీగ్రంథమును పారాయణించి తరించుచున్నారో లెక్కింపలేముకదా? దీనఁబ్రతిపాదింపబడిన విషయమును గూర్చి చెప్ప దొరకొనుట ఏతద్గ్రంథమునకు అపచారమును గావించుట! సహస్ర పర్యాయములు పఠించి ఆస్వాదింప వలసిన అమృతస్వరూప మీ గ్రంథము. ఆంధ్రజాతి చేసికొనిన అనంతపుణ్యఫల మీగ్రంథము. ఈగ్రంథమును వ్రాసి ఆంధ్రలోకము నుద్ధరించిన సిద్ధుడు శ్రీ పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి. అతని ముక్తాత్మకు నానతులు.

ఈగ్రంథరాజమును వేదాంతాభిలాషులుకాక సారస్వతాభిలాషులు చదువుట లేదు. అది చాలదోషము. దీనికి సారస్వతమున స్థానము లేకుండచేయు భాషాభిమానులను దానికి తగిన స్థాన మిచ్చుటకు ప్రార్థించుచున్నాను. భాగవతము వలెనే సర్వవిధముల నిధియు మనకు వేదాంతసారస్వత విషయములలో రెంటియందును శిరసాగ్రాహ్యము కాదగిన గ్రంథము.

తెల్లంకొండ రాఘవ రావు.

# ఎఱ్ఱాప్రెగ్గడ శిల్పము

## యక్షప్రశ్న ఖండము

తిక్కన పదునేనుపర్వములును వాగనుశాసనుడు రెండున్నరపర్వములును భారతమును పూరించినారు. వారిరువురును సముద్రులు. వారు వ్రాసినభారతభాగములకును, వారి మహావిస్తారములైన మేధావిశేషములకును సరిపోయినది. వారి యిచ్చ వచ్చిన తెన్నులు, ఇచ్చవచ్చిన రసములు, నిచ్చ వచ్చిన విఱుపులు, తోచినచోటుల నెల్ల కుప్పలుకుప్పలుగ గ్రుమ్మరించినారు. మహామేధావికి చిన్నపని చేయుట, యల్పబుద్ధికి మహాకార్యము చేయుట యెట్టిదో యంత దుర్ఘటము. ఎఱ్ఱన వదలి పెట్టినచో తిక్కనవలె పదునేనుపర్వములు నెనుగెత్త దగినవాడు. కాని హిమాలయకైలాసశిఖరముల వలె నన్నయ తిక్కనల రెండు కొమ్ములు కాయగా దానేమి చేయ గలఁడు? తాను పూరించిన యారణ్యపర్వశేషములో ఎఱ్ఱనశిల్ప మాతని హరివంశమున కన్న గూడ మిన్నగా కన్పడుచున్నది. అటు 'నన్నయ్య శారదరాత్రులకు' వెంటనే 'దావాంభః పటలంబులు' కురిపించినాడు. ఇటు తిక్కన, యితరు లుల్లంఘింపరాని నుడికారపు బాలవెల్లికి గ్రొత్తగ్రొత్త వంతెనలు గట్టినాడు.

ఎఱ్ఱనపాలికి చిన్నచిన్న కథలు పడ్డవి. భారతకవులు ముగ్గురును కథ చెప్పుటలో బృహస్పతులు. ఏ మహాకవియైనను దానొక కావ్యము వ్రాయుచున్నప్పుడు తొలుదొల్త లేని విసుపు, తొలుదొల్త లేని యుత్సాహము, తరిగిన పలుకుబడి, కావ్యము పోఁగాపోఁగా సిద్ధించుకొనుచున్నాము. భవభూతి ఉత్తరరామచరిత మిట్టిది. కొండవయంకము చివరకువచ్చువరకు మహాకవియుని కొండలు పొంగిపోయినది. అచ్చటినుండి యతని కవితాభాగిరథి కవజలముల తీరు అహస్నకర్ణములాగ లేదు. తిక్కనభారత మటువంటిది. తిక్కన ... సన్నద్ధముగా శిల్పపుపని యెక్కువ కలది ఆయన విరాటోద్యోగములలో లేక ... వెలుకు ప్రౌఢిమ, కాఠిన్యము, అర్థముల కేపదము యోగ్యమో యాపదమునే వాడుట, పోనుపోను శాంత్యానుశాసనికపర్వములలో పరిణమించి, మహాప్రస్థానము చేరినది. అంతవిసురు జూపించుట కెఱ్ఱనకు పదునేనుపర్వములు లేవు తాను వ్రా-
... శిల్పము తీరుదీపులు గ్రమ్ముకొన్నది.

నికి తనవాక్యముల కుత్తరములు —వేమో యన్న యనుమాన మున్నది. ధర్మరాజు యొక్క బుద్ధియందు నమ్మిక మున్నది. 'అట్ల యయ్యెదు సుమీ'యన్న చోటతండ్రి ప్రేమ యున్నది. తనవల్లనే కొడుకున కాపద వచ్చునేమో యని దిగులున్నది. కావున సంతేజాగ్రత్తి పడినాడు. ధర్మరా జడుగగా యక్షుడు తన రూపమును గనుబఱచినాడు. అది తాళసముచ్ఛ్రితాంగము. మహానిర్ఘోషసంతర్జితాఖిల భూతప్రకరము. దీర్ఘ విపులగ్రీవము. దంష్ట్రాసముజ్జ్వల వక్త్రము. విరూపలోచనము, తేజోఘనము. ఇట్లు భయంకరముగా నిలిచి "నా యనుమతి లేకుండగ నీయుదకము ద్రావిరేని యెవ్వారైన, ధీయుత చత్తురు నీవటు సేయకు సమ్యగ్విచార శీలుడ వగుటన్.

ఇట్టి బొబ్బకు సమానమైన బొబ్బ యాంధ్ర సారస్వతములో భాగవతసప్తమస్కంధమున నున్నది. హిరణ్యాక్షుని వరాహమూర్తిదునుమగా హిరణ్యకశిపుడు "మహాప్రభాజాలజటాలం బగుశూలంబు కేల నందుకొని, తటిల్లతాంకురసంకాశ ధగద్ధగిత దంతసందష్ట దశనచ్ఛదుండును, నదభ్ర భయంకర భ్రుకుటితఫాలభాగుండును నై సభామండపంబుననిలువంబడి, త్రిమస్తక త్రిలోచనశకుని శంబరశతబాహు ముఖ్యదైత్యుల నాలోకించి 'నాకుం దమ్ముడు మీకు నెచ్చెలి రణన్యాయైకదక్షుండు' అని యఱచినాడు. ఆ బొమ్మకును యీయక్షుని బొమ్మకును సాటి. చివరకు దన ప్రశ్నల కుత్తర మిచ్చుటకు మానిసి దొరకినాడుగదా యన్న యానందము 'సమ్యగ్విచారశీలుడ' వన్నమాటలో స్ఫురించుచున్నది. ఆమాటయే మరల ధర్మరాజు తొందరపడి నీరు త్రాగకుండగా వారించుచున్నది. నాప్రశ్నంబుల కుత్తరము చెప్పుమన్నాడు. వినయవంతుడైన ధర్మరాజు హృదయమున కదియే సాటి. అన్నాడుగదా ధర్మరాజు 'నీ చిత్తంబునకు వచ్చునట్లుగా చెప్ప నాబోటివానికి శక్యంబగునే ?' అని.

యక్షుడు ప్రశ్నలడుగ మొదలుపెట్టినాడు. ఒక వరుస రెండువరుసలు మూడువరుసలయి పోయినవి. అక్కడ నొకచిన్న వచన మున్నది.

'అనిన నప్పార్థివోత్తముప కప్పురుషుండు వెండయు నిట్లనియె.'

ఈ 'పార్థివోత్తము' డన్నశబ్దము ధర్మరాజు నెడల నప్పుడు ప్రయోగించుటలో ఎఱ్ఱనవాక్కు ఆశ్చర్యము గలిగించుచున్నది. ఆ వెనుకటి ప్రశ్నల సమాధానములు ధర్మరాజున కేబిరుదము నిచ్చుచున్నవి. మరల ప్రశ్నలవరుసవచ్చినది. ఇందు ప్రతిప్రశ్నకును క్రమక్రమముగా యక్షునిహృదయము ధర్మరాజునెడల నెట్లు స్నిగ్ధమగుచున్నదో, ప్రశ్న వేయు పద్ధతిలో గోచరించుచున్నది. మొదటి వరుసలోని నావిని యతడాతనితో జీవన్మృతు డెట్టివాడు సెప్పుమనుటయును' అన్న ప్రశ్నలోని యుపాధ్యాయప్రవృత్తియు, దరువాత వేయబడిన 'ఎయ్యది ధర్మువునకు పదము...యెయ్యది సుఖములకు నిక్కమేర్పడ జెప్పుమా' యీప్రశ్నలోని యను

నయమునకును యక్షుని స్నిగ్ధభవద్ధృదయము గోచరించు చున్నది, ఇంక గొంత దూరము పోవువర కింకొక చిన్నవేచన మున్నది. 'అని దివ్యుండు పలికిన నాదివ్య బోధనుం డి ట్లనియె. కొన్నిప్రశ్నలకు బూర్వము పార్థివోత్తముడైన ధర్మరా జిప్పుడు దివ్యబోధను డయినాడు. యక్షుడు వేసిన ప్రశ్నలలో నొకచమత్కార మున్నది. అతని మొట్టమొదటి ప్రశ్నలు మిక్కిలి కఠినము లయినవి. పోను పోను యక్షుని హృదయము కరగి తరువాత తేలికయిన ప్రశ్న లడిగినాడు; అడిగినవాని కెల్ల సదుత్తరములు చెప్పుటచూచి యక్షుని ధర్మహృదయము పొంగి పోయి చివర చివరకు మరల కఠినము లయిన ప్రశ్నలు వేసి నాడు. ఏప్రశ్నయు ధర్మరాజు తప్ప డని యక్షునకు దెలియుగా! అదియే ధైర్యము.

ఇంక ప్రశ్నలు మిగులలేదు. యక్షుడన్నాడు యధిష్ఠురుని దెస ప్రసాద మధురంబైన యాలోకనంబు నిగిడించుచు, 'మహాత్మా! మదీయంబులైన ప్రశ్నంబులన్నిటికి సదుత్తరంబు లిచ్చితి." ఈ'మహాత్మా!'యన్న సంబోధనము పరమ పవిత్రమైనది. దివ్యులు మనుష్యులన్న భేదము జ్ఞానము నందులేదు. జ్ఞానవంతుడు మనుష్యుండయినను దేవతలకైన పూజ్యుడే. సనాతనధర్మమతార్థములను భారతము లోని చిన్నచిన్న విషయములు గూడ నిట్లే యుపన్యసించు చుండును.

ఎఱ్ఱన శిల్పమిది. అడుగడుగునకు భావము. మాటమాట కర్థము. తలుముకొని తలచి చూచుకొన్నగాని గోచరించవు. ఇట్టి రచనాచమత్కృతి యెందైనను శిరసా అభివాదనము చేయదగినది. అందుకనియే యాంధ్ర భారతమును మించిన గ్రంథము ప్రపంచమునం దేసారస్వతమున నయిన సరే యున్నదనుటకు నమ్మకము చాలదు.

శ్రీ విశ్వనాథ వేంకటేశ్వర్లు.

# కళలు ప్రకృత్యనుకరణములా?

సముద్ర కెరటాలు విరిగినప్పుడల్లా గరుడపచ్చల పోగులు మిస మిస లాడి పోయిన ట్లా వెన్నెట్లో అద్భుతమైన దృశ్యం తోచింది. ఆకాశంలో తెల్లమబ్బులు నల్లమబ్బులు ఒకదానికి రాచుకుపోతున్నవి. ఎంత ఆనందం అనుభవించానో ఆతన్మయావస్థకు రూపము ఇవ్వలేకపోయాను.

నా రంగుల పెట్టెలో రంగులు తలుస్తూ నిట్టూర్పు వదిలాను. ఆత్మలోవుండే అనంత భావాల్ని మనస్సు గ్రహించలేదు- మనస్సు కూర్చుకునే అమృతరసాలు కుంచెతో చిత్రించనే లేము. రెండుసార్లా సముద్రచిత్రము వెయ్యడానికి ప్రయత్నించాను. రెండుసార్లూ పూర్తిగా అపజయం పొందాను. అట్టి బొమ్మలు ఇది వరకు ఏచిత్రకారుడన్నా వేసి జయం పొందినాడా అని పాశ్చాత్యులు చిత్రించిన ప్రసిద్ధి పొందిన బొమ్మలు - భారతీయ చిత్రాలు- అన్నీ పరికిస్తిని— ఎక్కడనూ అట్టి విచిత్ర చిత్రం కనబడనే లేదు.

మూడవసారి ఆ బొమ్మే మరల వేయడానికి ప్రారంభించాను. అప్పుడే నా మనస్సులో ఆలోచనలు పరిపరివిధాల పోయినవి. ఏమిటి నే చిత్రించేది? ఆనాడు నేను చూచిన దృశ్యవైచిత్ర్యమా? లేకపోతే ఆదృశ్యాన్ని పరికించగా నాలో మూర్తీభవించిన భావవిలాసాలినా? నేను బొమ్మలు చిత్రించడం నా మనః పరితృప్తి కోసమేనా? లేక మహాప్రేక్షక హృదయరంజనానికా?

రసకారకుడైన బ్రహ్మశిల్పి స్వీయమైన ఆనందమే ముఖ్యకారణంగా కళా సృష్టి చేస్తూవుంటాడు.

లలితకళలు సృష్టించే కవులు, చిత్రకారకులు, శిల్పులు వీళ్ళంతా తాము ప్రకృతివైచిత్ర్యం చూసి, ఆనందం పొందుతూ వుంటారు. వాళ్ళకి సృష్టించే చాతుర్యం వుండడంవల్ల కొన్ని ఉపకరణాలు సహాయ్యం తీసికొని ప్రకృతిని ఆధారం చేసికొన్ని, ఏ మేమిటో కల్పించుకు పోతాడు. అంతేనేకాని తాము చూసినటువంటిదృశ్యాన్ని సరిగా తర్జుమాచేయడు. అలా చేయనూ లేదు.

ఈ సందర్భంలోనే మనవాళ్ళకున్న కొన్ని అభిప్రాయాలు గమనింపవలసి వస్తుంది. కొందరు కళ ప్రకృత్యనుకరణం అంటారు. కాని కళాతత్వజ్ఞులు కళ సృష్టి అని వాదిస్తారు.

కళ ప్రకృత్యనుకరణం అనేవారు ఏమని వాదిస్తారంటే, మనుష్యునికి ప్రకృతిని అనుకరణచేయడం అంటే చాలా యిష్టం. కుక్క అరుపులా అనుకరణంచేయడం చూస్తే మనకు సంతోషం, కాగితంతో గులాబిపూవు చేస్తే సంతోషం, అచ్చంగా మామిడి కాయలా బొమ్మగీస్తే ఆశ్చర్యం, బుడబుడక్కలవాణ్ణి చూసినప్పుడుకన్న ఆలా వేషం వేసిన నటకుణ్ణి నాటకంలో చూస్తే చిత్రంపోతాము. మనుష్యునిలో వున్న ఈ ప్రకృతే మనుష్యుడు సమస్తకళలు కల్పించుకొన్న గహాస్యానికి సూత్రము. ఈలా సంతోషంపొందే తత్వమే ఆదిమనుష్యులు రాళ్ళపై గీసుకున్నటువంటి బొమ్మలకు మట్టితో చేసుకున్నటువంటి బొమ్మలకు కారణమైంది అని. ప్రకృత్యనుకరణ వాదనకు మంచి ఉదాహరణాలు చిత్రకళా, శిల్పమూ అభినయమున్నూ. లియొనార్డో డా విన్సీ లా గియకోండా అనే చిత్రము వాలెక్వెజువాన్ పైకు రెమ్బ్రాంటు రెయినాల్డ్సు గెయిన్సబరో అనే చిత్రకారకలు ప్రఖ్యాత స్త్రీపురుషుల చిత్రములు లిఖించలేదా? వారు అనుకరణము చేయలేదా ? అని వాదిస్తారు.

౨

కళ ప్రకృత్యనుకరణము కానేకాదు.

కవిత్వమునందున్నూ సంగీతమునందున్నూ అనుకరణం అసలేలేదు. ప్రకృతి వున్నదివున్నట్లుచెప్పడం అనుకరణంకాదు అది వర్ణించడము. కవిత్వము ప్రకృతిలో వుండే ఒకమార్గాన్ని అనుసరించడ మని అనగలమా? సంగీతము, సెలయేటిధ్వనులు, పక్షుల కూతలు మొదలయిన వాటిని అనుకరించడం అంటే, అది ఉత్పే కాని నిజ మెట్లా?

వీణా మొదలైన సంగీతసాధనాలతో పిల్లికూతలు మొదలైనవి అనుకరించడం నోటితో అనుకరించడం లాంటివే కాని సంగీతాలు కావు.

ఇక చిత్రలేఖనలో అనుకరించడ మనేది ఎట్లా వీలు! ప్రకృతిదృశ్యం గీస్తే దూరాలు, లోతులు, ఒక చిన్న కాగితం ముక్కమీద ఎట్లా తీసుకురావడం. ఒక మనుష్యుణ్ణి పోలే విగ్రహం చెక్కితే వాని రక్తం మాంసం రంగు తీసుకురాలేము. ప్రకృతిలో వర్ణాలు అనంతం, మనుష్యుడు తయారు చేసుకున్నవి కొన్నివందలు ఉంటాయి మహా అయితే.

అప్పుడు అనుకరణవాది "కళ అంటే సృష్టికి ప్రతిసృష్టి కాదు. ప్రకృతిలో కొన్నిమాత్రమే రచించి ప్రకృతే అని అనుకొనేటట్లు చెయ్యడం—ఇలా భ్రమింప చెయ్యడమే కళ" అని వాదిస్తాడు.

అయితే ఛాయాగ్రహణయంత్రంతో తీసిన బొమ్మలు కళాస్వరూపాలా? ఆ యంత్రంకన్న మనుష్యు డెక్కువ సరిగ్గా బొమ్మ గీయగలడా? రంగులు కూడా ఈ యంత్రంతో తీస్తున్నారు. ప్రకృతిలోవుండే రంగులతో సహా బొమ్మలు తీసే యంత్రము పటాలు కళాస్వరూపాలా? అని ఈతలవాడు అంటాడు.

అసలు ఫోటో తీసేటప్పుడే అనవసరమైన వస్తువులు ప్రతిబింబితము కాకుండా చూచుకుని యంత్రచిత్రము తీస్తారు. మనుష్యుడిపటం కూడా ఒకమోస్తరు, ఒక చోట కూర్చోపెట్టి వెనకముందు సరైన వస్తువులుంచి (రోజూ ఆ మనుష్యుడు వుండే మోస్తరుకాకుండా) పటము తీస్తారు. అలాంటి అప్పుడు చిత్రకారకుడు ప్రకృతి దృశ్యంగాని, మనుష్యుని చిత్రంగాని రచించేటప్పుడు తన అభిప్రాయానుసరణంగా పోతాడుగాని అనుకరణం ఎంతమాత్రం చేయడు.

టర్నరు, వెష్టు, జే. పి. గంగూలీ మొదలగు ప్రకృతి దృశ్య చిత్రకారకులు సరిగ్గా ప్రకృతిని అనుకరించారా? ఫలానా రోజున ఫలానా సమయంలో ఫలానా దృశ్యం ఏలావుందో అది వేయలేదు. థేమ్సునది చిత్రం వేయాలని టర్నరు ఆ నది ఎక్కడ అందంగా కనుబడుతుందో అది చూసుకుని చిత్రముయొక్క సంపూర్ణత్వానికి భంగంకలిగించే వస్తువులు లాగేసి, అవసరమైన వస్తువులు చొప్పించి, ఒక చిత్రం రాస్తాడు. మంచిరకం పడవ వుండాలని అతనికి తోస్తే పడవల రకాలు అన్నీ పరిశీలించి ఒకమంచిరకం పడవ ఆ చిత్రంలో వేస్తాడు. మేఘాలు కావాలసి అనేక రకాల మేఘాలు పరిశీలించి ఆపటానికి సరియైనమేఘం అక్కడ పుట్టిస్తాడు. ఈ రీతిగా పటం తయ్యారవుతుంది. ఇది అనుకరణమా? ప్రపంచలో ప్రసిద్ధిపొందిన ప్రకృతి దృశ్య చిత్రాలన్నీ యిట్టివే.

ఇక మనుష్యవిగ్రహాలు రచించే చిత్రకారకుడు ఏవ్యక్తిచిత్రం రాయాలో, వాణ్ణి బాగా గమనిస్తాడు. నెలలైనా సంవత్సరాలైనా సరే (లియోనార్డో లాగియకొండా వెంట కొన్ని సంవత్సరాలు తిరిగాడట) అప్పుడు ఆవ్యక్తిలో వున్న ఆత్మతత్వాన్ని గ్రహించి అవి వుట్టిపడేటట్లు చిత్రం మూర్తీభవింప చేస్తాడు. ఆ మనుష్యుని జీవితంలో మనకు తెలియటం అవసరంలేని వన్నీ చిత్రకారకుడు మాయం చేస్తాడు. ఇది అనుకరణమా? ఈ సత్యమే శిల్పానికిన్నీ.

అభినయము చేయడం ఎవర్ని అనుకరించడం. ఇప్పటి వాళ్లను చూసి అదే రీతిగా నడవడం మాట్లాడడం మొదలైనవి అభినయ మవదుకదా. ఇక ఏనాటకం పాత్రో, ఆపాత్ర చరిత్రసంబంధమైనది కాకపోతే అనుకరణ లేదు. అయితే కూడా అప్పటి యా పురుషుడు ఎల్లా జీవించాడో ఎల్లా సంచరించాడో మనం అను కరణ చేయగలమా ?

ఇక దేవతాచిత్రాలూ విగ్రహాలూ అనుకరణములు కావు.

౩

కళాతత్వము సృష్టి. ప్రకృతి ఆధారము మాత్రం. దాన్ని పరికరముగా చేసుకొని కళాకారకుడు సృష్టించుకు పోతాడు.

కవిత్వంలో వేదాలకాలంలో ప్రకృతివైచిత్ర్యం చూసి ఆ నాటి ఆర్యకవి కొన్నిశక్తి స్వరూపిణు లగు దేవతలను నిర్మించుకొన్నాడు. ప్రకృతిలో వున్నఉన్నత ప్రాణి తానే. తనకే ఉత్కృష్టశక్తులు రూపాలు అలవరించుకొని దేవుళ్లను సృష్టించాడు. వాళ్లని గూర్చి కల్పించుకు పోతో గీతాలు పాడగా ఋక్కులు బ్రహ్మవాక్కులయినై. అన్నికళలూ ఆ దివ్యమూర్తుల భావనాసృష్టిలో వెలసినై. అన్ని దేశాలవారు ఈజిప్టు, గ్రీసు, బాబిలను, చీనా, ఆర్యావర్తము, పారసీకము, ఈరీతిగా కళాసృష్టి ప్రారంభించినవి. అపాలోవిగ్రహాలు, రా, నీగూస్వరూపాలు, అహోసు రాసు, ఇంద్ర వరుణ సూర్యులు, దివ్యరూపాలతో తేజరిల్లారు.

కళలే సర్వవిద్యలకు ప్రాంగణాలైనవి. విజృంభించిన ఈ కళాశక్తి అనేక మార్గాలు సంచరించింది.

వెనుకటి యుగాలయందు ప్రకృతిదృశ్యాలనూ, చరిత్రపాత్రలనూ, కళా రూపంతో తేజర్లిల్లచేసి నప్పుడు, ప్రకృతిలోని దృశ్యం, చరిత్రలోని విగ్రహం ఆధారం చేసికొని, కళాకారుడు వాటినే పునః సృష్టి చేశాడు.

పాతగాథలు షేక్సుపియరు కాళిదాసులు నాటకాలు వ్రాసినారు. భారతము తిక్కన్న తిరిగి తెనుగులో సృష్టించాడు.

కళకి ఫలితము ఆనందమే. రసాభిజ్ఞుడగు కళాస్రష్ట తన హృదయానందానికిన్నీ ప్రేక్షకహృదయానందానికిన్నీ ప్రతినిధియై కళాసృష్టి చేస్తూవుంటాడు. కళా

వస్తునైజాన్ని బట్టి మనస్సునకో, బుద్ధికో, అహంకారానికో, ఆత్మకో, ఆనందం కలుగుతూ వుంటుంది.

భ్రమింపచేయడం అనే అనుకరణవిద్య సంతోషం యిస్తుంది, మంత్రతంత్ర శక్తి వంటిది. దీనికి ఒక పూర్వకాలపుగాథ వుంది.

పూర్వకాలంలో ఒక రాజు తనదేశంలో చిత్రకారకు లందరినీ బొమ్మలు వేసుకు రమ్మన్నాట్ట. వచ్చిన పటాలన్నిటిలో మూడు మంచివని ఆ దేశపు చిత్రకళా సంఘంవాళ్లు ఆమోదించి,మూడుబొమ్మలు రాజుగారి పరీక్షకు పంపించారట.ఆరాజుగారు మొదటిబొమ్మ తీస్తే అందులో జామమొదలగు పళ్ళు రాసివున్నై. అవి నిజంపళ్లనుకొని ఈగలు వచ్చి ఆ పటంమీద వాలినవట. రెండోబొమ్మ తీస్తే మాంసాదులు చిత్రించివుందట. ఆరాజుగారి పెంపుడు కుక్క ఆబొమ్మ కరుచుకు పోబోయిందట. మూడో బొమ్మ రాజుగారు చూసారు. అందుమీద తెరవుంటే ఒత్తిగించబోయారు. తీరా చూస్తే అచిత్రంలో ఒక తెరచిత్రం రచించి వుందట. రాజుగారు ముక్కుమీద వేలుపెట్టుకొని, ఏమి ఆశ్చర్యం! మొదటిబొమ్మ జ్ఞానశూన్యములైన ఈగల్ని మోసపుచ్చింది. రెండోది క్వచిత్తు జ్ఞానంవున్న కుక్కను మోసంచేసింది. మూడోది జ్ఞానవంతు ణ్ణయిన నన్నే భ్రమింప చేసింది. వహ్వా మూడో దానికే బహుమతి అన్నాట్ట.

ఆ బొమ్మలు కళాస్వరూపాలు కావు. వాటిని చూసిన సంతోషం అవిఅంత బాగా అనుకరణం చేసినందుకే కలుగుతుంది. ఆ బొమ్మయొక్క వ్యక్తిత్వస్వరూపానికి కానే కాదు. కళాస్వరూపం ఎటూ నిరూపించ చెప్పగలము!ఒక కళావస్తువును పరికించినప్పుడు ఆలోచనాపూరితమైన ఉత్సాహం కలిగి, మన్ని ఆనందంలో ముంచివేస్తుంది.

అజంతావిహారములోని ఒకచిత్రంలో రాజదంపతులు ఒయ్యారంగా తన్మయులై కౌగిలించుకొని యున్న చిత్రము పరికిస్తూ అట్లనే నిలిచిపోయాను. ఉబికి సన్నని రాగాల ప్రవహించే కొండ వాగులా, నా ఆలోచనలు వెల్లివిరిసినై. దంపతుల జీవితము ప్రేమస్వరూపం కాబోలు. వీళ్లకి బాహ్యప్రపంచ మంతరించింది. ఇరువురి ప్రేమాలలో ఒకరొకరు ప్రతిఫలించి లీనమై ఏక ప్రవాహము ప్రవహించి పోతున్నారు.

అహో ప్రణయదేవతా! నువ్వే సృష్టికి ఆదికారణమువా? అని ఏమేమో భావాల్లతరంగాలలో తాండవించి పోయాను.

౨.

కళాతత్వ మన్ని కళల కొక్కటే. అన్ని దేశాలకూ, సాంప్రదాయాలకున్నూ ఒక్కటే. పాశ్చాత్యులు ప్రాపంచిక రసోన్మాదం కలవాళ్లు వాళ్ళని పులకరింపచేసేవి బహిర్దృష్టి గోచరము లగు ప్రకృతి స్వరూపాలే. నదులు కొండలు అడవులు ఆకాశం మనుష్యుడు వాని నడత, అతని జీవితమున్నూ. ప్రాచ్యఖండవాసులు ఆత్మైక్యోన్మాదం కలవాళ్ళు. నదులలో కొండలలో మేఘాలలో మనుష్యుని జీవితంలో, అగోచరమై వెలుగు ఒక అద్భుత తత్వము, సాధారణ ప్రకృతిని మించి భావలోచనాంచలపథాల దృశ్యాదృశ్యంగా నృత్యంసేయు మహాప్రకృతి యొక్కటి వాళ్ళు గమనించి ప్రకృతిస్వరూపం ఆ మహాప్రకృతిని నటించుట కుపకరించున ట్లొనర్చి కళాసృష్టి చేస్తారు.

రెండు సాంప్రదాయాలలోను అప్పుడప్పుడు వీరు వారినీ, వారు వీరినీ, అనుకరించిన కాలా లున్నవి; కాని ఆప్రయత్నాలు వాళ్లవాళ్ల తత్వాలకు సరిపడక రెండవరకంగా పరిణమించినై.

శిల్పంలో గ్రీకువారు మహోన్నత పథాల నంటారు. దేవతావిగ్రహాలు చెక్కినా ఫైడాసు, ప్రాగ్జిలిటీసు మొదలగు శిల్పులు సంపూర్ణంగా మానవ రూపం మాత్రం సృష్టించారు. దేవుడు మానవాధికుడు అనేందుకు మాత్రం మానవ విగ్రహంలోవుండే లోపాన్ని సవరించి, సర్వాంగసుందరమైన విగ్రహము సృష్టించారు. మానవునికి ప్రకృతిసిద్ధము లైనశక్తులు గంభీరముగానున్నూ, గాఢముగానున్నూ నిరూపణచేశారు. ప్రాచ్యశిల్పులు దైవస్వరూపం సృష్టిచేస్తూ మానవ మూర్తిని అతిశయం మాత్రం [ఎగ్జాజిరేషన్] చేయలేదు. మానవవిగ్రహం పరికరణం చేసుకొని దేవమూర్తులను సృష్టించారు.

పాశ్చాత్యకళాబ్రహ్మలు సాధారణవస్తుస్వరూపాలు సృష్టించేటప్పుడున్నూ, ప్రకృతిని అతిశయింపచేశారు. ప్రకృతిదృశ్యం చిత్రించేటప్పుడు ఆదృశ్యాంలోవుండే మనోహరత్వం గాఢముగా నాటుటకు, కొండల నదుల అడవులరూపాలు అతిశయించిన వర్ణాలు, ఇనుమడించిన పొంకాలు చూపించారు. మానవవిగ్రహంలోను అంతే. శరీరము చిత్రించటంలో పాశ్చాత్యచిత్రకారకుడు ప్రతిఅంగుళం చర్మానికి చాలారంగులు వాడ్తాడు. ప్రతి ఆవగింజ పరిమాణభాగం విడివిడిగారంగు వేస్తాడు. శిల్పిన్నీ ఒంటికండలు అసలు మూడుండవలసినవి ముప్పైచెక్కుతాడు.

ప్రాచ్యచిత్రకారకుడు సాధారణవిషయం చిత్రించినా, మహాప్రకృతే సుమా. దృశ్యప్రకృతి ముసుకవున్నది. కళ ఆ అగోచర స్వరూపాన్ని చూపించడా

నికే సుమా. అలాంటి అప్పుడు దృశ్యప్రకృతి పరికరముగామాత్రం ఉపయోగించాలి అని. ప్రకృతిదృశ్యం అయినా మానవవిగ్రహంలోని (డీటైల్సు) తగ్గింపచేసి అనగా అద్దంయొక్క ప్రకృతిని విజృంభింప చేసి చిత్రిస్తాడు చిత్రం. మూడుకొండలుంటే ఒక్కటే కొండ చిత్రిస్తాను.

మార్గములు వేరు. సంప్రదాయములు వేరు. కాని ప్రాచీప్రతీచీకళాస్వరూపములు ఆనందతత్త్వైక్యములై వాటివాటి పథాల విజృంభించి ఒకదానికొక్కటి సహాయభూతములై సూర్యుడు చంద్రుడులా ఒక్కసత్యమే అవతరింపచేసి మానవ జీవితము ఉత్కృష్టం చేస్తూవున్నవి.

అడవి బాపిరాజు

# తెనుగు నవల.

[సంభాషణ-గ్రంథమాలా సంపాదకుడికీ, నవలా రచకుడికీ.]

సంపా—"సరే! అసలు పుస్తకానికి శైలి కదా ప్రధానం. మీశైలి యెట్లావుంటుందో కొంచెం చదివి, వినిపించండిముందు. కథ క్లుప్తంగా చెప్పే దరుగాని.

రచ—ఈకాలంలో శైలి యెవరికి కావాలండీ. కథా, ప్లాటూ, బాగుంటే సరి.

సంపా—అట్లాచూస్తే, ఆరెండింటికన్నా-'గెటప్'షోకుగా వుండాలి. అది ప్రజాసామాన్యానికి. కాని అసలు ముఖ్యంగా మన వుద్దేశ్యం ఆలోచించండి. మనమింత వ్యయప్రయాసలకోర్చి, దేశసేవకని పుస్తకాలు వ్రాయడమూ, అచ్చువెయ్యడమూ, వాళ్ళకి కథలు చెప్పడానికా? కథ యేమసలమ్మనన్నా చెపుతుంది. అకథలమూలంగానన్నా మంచిశైలి ప్రజలచేత చదివించి, ఆంధ్ర భాషను అభివృద్ధి చెయ్యాలని కదూ?

రచ—అవునుమరి. అట్లాగే...గ్రంథం మొదటి నించీ చదువుతాను. రెండుపనులూ కలిసి వొస్తాయి. మొదటిప్రకరణం.

సంపా—కొంచెం వుండండి. యిది యెట్లాంటి నవల?

రచ—చరిత్రాత్మకమైనది.

సంపా—యేచరిత్ర?

రచ—రాజపుత్రస్థాన చరిత్రవిషయాత్మకము. పదిపన్నెండు శతాబ్దములనాటిది. వుదయాదిత్యుడి శకము.

సంపా—మంచిదే.

కర్త—ఒకటోప్రకరణం. 'ఆర్తనాదము' "ఒకనాటి మట్టమధ్యాహ్నమందు మధ్యందిన కరుండు తన మండితకరంబుల నొకభయాకులగహనభాగంబు నెల్లం భాసిల్లం జేయుచుండె. అంతులేని యరణ్యంబును, ప్రసూనలతావిచిత్రంబును, సింహశార్దూల మదేభాది ఘోరమృగ ప్రణీలంబును.

సంపా—పోతన్న గారిభక్కిని పోనిచ్చారన్నమాట! తరవాత......

రచ—ఆసమయంబున సమస్త జీవరాసులును ఆగ్రీష్మభానుని అతపాతురకుం సొమ్మసిల్లి, మూర్ఛనంది, పత్రంబులం, గుహాంతరంబులం, శరణ్యంబుం గొనియుండె. అరుల జాచి, నాలుకలు జాపి, కాళ్లు నిగిడించి, లేళ్లు దప్పింగొని..

సంపా—సరే, మామూలేగా. ఆవర్ణన అయింతరవాత.

రచ—రెండో పేజీలోనే మన కథానాయకుడు వొస్తాడు.

ఆయున్నతసుందరమహీరుహనిబిడాంధకారచ్ఛాయల నాశ్వికుం డొకండు, దీర్ఘప్రయాణంబున నలిసియున్న త్వదీయయుత్తమతురగరాజముం మెల్లన విదళించుచు నేదియో దీర్ఘాలోచనాతత్పరుం

డై, గొణుగుకొనుచు, మహాకష్టతర ప్రయాణం బొనర్చుచుండె. ఆయన వయసు నిర్ణయించుట కష్ట సాధ్యంబు. యువకుడు కాడు. కాని ముసలియు కాడు. అతని......

సంపా—కాలుడు కాబోలు!

రచ—కాదు. వినండి. మీకే తెలుస్తుంది.

సంపా—కాలుడా, యువకుడు, ముసలివాడూ కాడూ? మనిషేనా?

రచ—యేమిటండీ అట్లా అంటారు! "అతడెక్కువ పొడుగరియూ కాడు. పొట్టియూ కాడు. అతని శరీరచ్ఛాయ, అంత తెలుపునుం గాదు, నలుపునుం గాదు

సంపా—చామనచాయ అనుకుంటాను.

రచ—అదియును గాదు.

సంపా—అదీ కాకపోతే, యేదో చెప్పరాదూ? గులాబీరంగో, గువ్వకన్నో, నెమలిపింఛపు రంగో.

రచ—వెక్కిరించకండి. అట్లా రాస్తేనేగాని చదువరులకి గర్తిమ కలగదు. వినండి. "అతని ముఖంబున సహజతుష్టియవ్వనము తాండవమాడుచుండె. గాని బలిష్టములగు అతని భుజములపై ప్రేలాడు ప్రజ్వలిత కాషాయాంబరములు అతడెవండో ప్రచ్ఛన్నమహాపురుషుండై యుండవలెనని తోపించకపోవవు. అతని నయనంబులు నారికేళపత్రంబులవలె విశాలంబులును,

సంపా—నారికేళ పత్రము లేమిటండోయి!

రచ—పాత ఉపమా నాలేనా యెన్నాళ్లైనా? విశాలంగా వుంటే సరి. యేవుపమానమైతేనేం? అతనికంఠము ధ్వజస్తంభము. అతని బాహువులు రెండును.

సంపా—అదంతా వొదిలేసి. తరువాత చదవండి.

రచ—మీరేవన్నా లేమి సరిపడనట్లున్నాయే?

సంపా—యిష్టంలేక పోవడమేం? వృత్తకథాభాగంలో రెండువందల పేజీల పుస్తక మెట్లా అవుతుంది? కాని యిప్పటికి దాటెయ్యండి.

రచ—మీరే యిట్లా వాటిని వొదిలేస్తే యింక పాఠకులు వాటిని అసలు.

సంపా—యిప్పుడు అసలు నవలలు చదువుతున్నారనా, మీవుద్దేశ్యం? అక్కడక్కడ యేరుకుని చదవడం నేర్చుకుంటోనే వున్నారు కాని మరిరెండువందల,

రచ—తెలిసింది—యిదుగో వినండి.

"తనలోతానిట్లు అత్యధిక ధీరంబుగ పల్కుకొనుచుండెను. "ఓరీ! విచిత్రవీర్యా, నీ కింతటి కండకావరము మురిసెనురా! ఉదయాంగ్యుని మేనగోడలనియైన నెంచక, రామచంద్రాఖ్యుని, బావ మరిది తనయాత్మజంపు తోడికోడలనిగైన యినుమంతి యెన్నక, దుర్బుద్ధి ప్రేరితుండవై, కాలవశం బున, 'వినాశకాలే విపరీతబుద్ధిః' అనునందంబున్న, నాయమ నెంతి చేసితివిరా? నీకన్యకొన్న గోత్రియంగన నీవయె పడంబూనితివిగా!

సంపా—యేం చేశాడేమిటి?

రచ—అదంతా చివరికి తెలుస్తుంది.

సంపా—అట్లాగే వుండాలి కథాచమత్కారం. బాగా చేశారు.

రచ—ఓరీ, నీచాధమా, నేను లేని సమయము కనుంగొనిగదా, నీవీయక్రమంబునకు సాహసించితివి. యిదుగో నే నిప్పుడ వచ్చుచున్నాడను. నిన్నును నీసైన్యంబును.

సంపా—బాగు - తరువాత-

రచ - యింకో స్వగతము వుంది. దాని మొదలిది.

'అహో! హిమాచలసేతు పర్యంతంబును, సస్యశ్యామలసమన్వితమై వేదఘోషంబులతోడను, గోధేను రావంబులతోడను, ఉత్తమస్త్రీయప్రలాపంబులతోడను, ధ్వనించు భారతమాతకా, యీసాటిలేని కట్టిదంబులగు యిక్కట్లు యేనాడు రాణాప్రతాపసింహుడు అమరుడాయెనో ఆ దుర్దినంబు.

సంపా—యీస్వగతి మెంత వుంటుంది ?

రచ—రెండు ప్రకరణాలు. దీంటో యిదివరకి జరిగిన కథా, అప్పటిదేశపరిస్థితులూ చర్చిస్తా వొచ్చేస్తాయి.

సంపా—అవును. బాగా చేశారు. మళ్లీ దేశచరిత్ర వేరే పుస్తకంగా రాసే అవసరం లేకుండా ఆశూరుడిచేతే చెప్పించేశా రన్నమాట?

రచ—వూరికే శూరుడంటారేమి? శూరాతిశూరుడు. మీరే చూస్తారుకదూ. అదిగాక మీరిందాక అన్నట్లు మనబళ్లల్లో దేశచరిత్ర చెప్పడమే లేదు మన బడిపిల్లలకి 'ఎలిజబెత్తు, యెన్నోయేట సింహాసనమెక్కిందో కంఠోపాఠమే గాని సీతమ్మవారు సముద్రాడి దినక్షత్రమేదో తెలిసే తెలీదు. యిట్లాంటి కథల మూలకంగానన్నా కొంత రాజస్థానచరిత్ర తెలిపి,

సంపా—ముందు ఆంధ్రదేశచరిత్ర.

రచ—నేనూ అదే అనుకుని ప్రయత్నించేశాను. కాని మన ఆంధ్రవీరులు ఆట్టేమంది కనపడలేదు.

సంపా—వీరులు లేకేం? వాళ్ల సంగతి యీచరిత్రల్లోకి యెక్కనీరు.

రచ—ఒకళ్లిద్దరు కనపడ్డారు. గాని వాళ్లిద్దర్నీ విజ్ఞాన చంద్రికామండలి వారిదివరకే వాడేశారు. తక్కినవాళ్ళు అనామకంగా వివాహాలు చేసుకోడంవల్ల వాళ్లభార్యలపేర్లన్నా తెలీదు. మరి ప్రణయం కల్పించడానికి 'ప్లాట్' వీలిచ్చింది కాదు. పోనీ రాజస్థానమైనా మన దేశంలోదే కదండీ?

సంపా—కాని రైల్లో రాజస్థానం వాళ్ళు ఆట్టే మనకి సోదరులమల్లే వుండరండీ? యెంతకీ మనం దేవులాడడమే కాని. వాళ్లకి ఆసోదరత్వభావ మున్నట్లు తోచదు. బోధించే వాళ్లు లేక కాబోలు - ఒకసారి యీమ యిందంటే.

రచ—(పుస్తకం చూస్తో పరధ్యానంగా) అవును. బాగా చెప్పారు, నిజమే వినండి.

"1026 సంవత్సరాంతమున ఒకనాటి సాయంత్రము వాయుసింహుడు గతించె కదా! యింకెవ్వరు మాకు దిక్కు? యీశత్రువర్గంబుం..."

సంపా—అదేదో క్రీస్తుశకం వాడేరు ?

ర—యేం? మరెట్లా దేశచరిత్ర తెలీడం ?

సంపా—మరి ఆకాలపువాడు క్రీస్తుశకం ప్రకారం లెఖ్ఖపెట్టి వుంటాడా ?

రచ—నే నేమన్నా క్రీ. శ అని వేశానా యేమిటి? అట్లా అనుకోడానికి? అయినా మనం యీకాలంలోవాళ్లకిగా రాస్తోంది; వాళ్లకది అర్థమైతే ఆశకాస్నే వాడాలి.

అల్లాంటి పాడుపుస్తకాలు చదివి మన స్త్రీలందరూ ఆనాయికల్ని ఆదర్శంగా తీసుకొని బోర్లపడుతున్నారు. ఆకాలంలో వీరుడు అబలలకి తోడ్పడడం సహజం. యెంత రక్షించినా, పరపురుషుణ్ణి రాచస్త్రీ పలకరిస్తుందా? అసలు కన్నెత్తి చూస్తుందా?

సంపా—అయితే మరి వీళ్లద్దరికి మోహమేర్పడదా యేమిటి యీకథలో?

రచ—యేర్పడకేం? అదెట్లా తప్పుతుంది? లేకపోతే కథయేది?

సంపా—ఒకరినొకరు చూడకుండానే?

రచ—అదే మనవాళ్లుపడే గొప్పపొరబాటు. అందుకా, ప్రతివాడూ మోహమేర్పడ్డానికి ఒకరినొకరు చూడాలా? చూస్తే యేం తెలుస్తుంది? అనురాగమంటే, యిదా అర్థం? పాశ్చాత్తుల పుస్తకాల్లో "లవ్ ఎట్ ఫస్టుసైట్" అట్లాంటివి చదివి భ్రమపడి, రాసే రాతలివి. దమయంతి నలుణ్ణి చూసేవొలిచిందా; బ్రాహ్మలవల్లా, హంసవల్లా, అతని సద్గుణాలు విని. రాముడు విల్లు విరిచింతరవాత, వీడు నల్లగావున్నాడు నాకు వద్దని సీత [illegible] ముక్కెట్లాగావుంటేనేం, కాలెట్లావుంటేనేం, బుద్ధిమంతుడై వుండాలి గాని!

యీవిషయమై తెలిసేటట్టు వ్రాశాను. యీనాయికా ప్రకరణంలో 'పౌరకమహాశయులారా! వీరిరువురు నొకరి నొకరు వీక్షించుకొనకనే యేవిధంబున కామించుకొనిరని మీరలు సందేహింతురేమో? కాని మీరాలోచించి చూడుడు. యీనాటికిని యౌన్నత్యంబగు మన మహాహిందూమత సాంప్రదాయ మట్టిదే గదా! మనదేశంబున ధనంబును, వంశంబును ప్రాముఖ్యంబులుగాని తుచ్ఛంబును అస్థిరంబునగు శరీరంబు కాదుగదా! యింకను...

సంపా—తరవాత కథ చెప్పుతా చూడండి. నాయికానాయకు లిద్దరూ చూసుకోకుండానే యెవరితోవవారు వెళ్లారు. తరవాత—

రచ—ఆ అప్పుడు [illegible] ఎచ్చటనులేళ్లను లేళ్లనుతినను తోడేళ్లను తోడేళ్లందినను పులులను పులుల వేటాడు వేటగాండ్రను వేటగాండ్రను గరుచు పాములను పాములం భక్షించు నెమళ్లను [illegible] సాధు ఋషిపుంగవులను ఆరణ్యలం కామించు...

సంపా—తరువాత.

రచ—మీకీవర్ణన లేమీ రుచించినట్టులేదు.

అప్పుడే అయిదో ప్రకరణం మొదలు. దీనిలో అమరపురాధీశుడైన వీరసేనుడి మూడవకుమార్తె.

సంపా—చదువుతున్నారా? చెప్పుతున్నారా?

రచ—చెప్పుతున్నాను. పోనీ. చదవనా?

సంపా—వొద్దు వొద్దు. చెప్పేప్పుడు ఆప్రస్తుతం భాషెందుకు? నోటిమాటలతో రానిద్దురూ.

రచ—బాగా ఆభాష అలవాటై పోయిందండీ.

సంపా—మీరుండండి. నేను చెప్పుతాను. "ఆ అయిదో ప్రకరణంలో ఆజ్యోతి" విరహతాపం పడుతూ వుంటుంది.

రచ—కాదు. జ్యోతి కాదు. 'విమల' విరహతాపం పడుతూవుంటుంది.

సం—యీవిమల యెవరు?

రచ — అదే చమత్కారం యీనవలలో.

సం — సరే. అవిమల తన అంతఃపురమందిరపు యేడో అంతస్తుమీదనుంచుని ప్రలాపిస్తోవుంటుంది. ఆమెని వివాహమాడాలని సింహగిడ దుర్గాధీశుడూ, ఢిల్లీపాదుషా, కొండవీటిరెడ్డి, దండకారణ్యపు తోడాలమల్లుడూ ఆమె సౌందర్యప్రకీర్తి విని కోట ముట్టడేశారు. ఆమె తండ్రి వీళ్లెవ్వ యెవరికీగాక యింకోరిని వివాహమాడమంటాడు.

కాని యీకన్య హృదయం మాత్రం పంపానదీతీరమున స్నానం చేస్తో యెవరి మీసపు వెండ్రుకని చూచిందో ఆరాకుమారుడితో లగ్నమయింది.

రచ — కాదు. ఆనాడు తనని కిరాతుల నుంచి కాపాడిన మహీరుహుం డెవ్వండో ఆనరసింహుని

సం — ఆ — ఆమె యెవరో జ్యోతి అన్నారుకదూ ?

రచ — నేన సందే ! అదే యీనవలలో చిత్రం : ఆవీరుడికి బోయలు అప్పచెప్పారు. ఆమె విలాపం వినండి.

"ఓహో చెనటిదైవమా ! హతవిధీ ! నిన్నేమందురా ? నేనేల అరణ్యంబునకుం బయలుదేరితిబో ! నన్నా కిరాతులు ముట్టడింపనేల ? డించిరిబో ! నేనేల మొలిడవలె ? యిడితిబో ! ఆగాకొమరుం డాదారిని బోవనేల ? బోయెనుబో ! ...

సం — తరవాత నిలిసిందేగా ...

రచ — వినండిమరి.

సం — తరువాత నన్నుకొంచెం చెప్పనీండి. "యేల వినవలె ? వినెనుబో యేల రావలె ? వచ్చెనుబో, యేలశౌర్యము చూపవలె ? చూపెనుబో, నేనేలమోహనైతి? ఇట్లానేనా ?

రచ — అట్లానే ;

సం — యింకోటి, మీరుశృంగారరసం యెక్క వచే శేసారు. అవన్నీ యీకాలానికి సరిపడవు. రెండుగజాల దూరంనించి, నుదురుమీద ఒక్క ముద్దుపెట్టించడంకన్న, యింకదగ్గరగా యేపనీ జరిపించకూడదు. యేపత్రికన్నా "పచ్చిశృంగారమని విమర్శించిందంటే, యింక మనపని సున్న." స్వప్నంలోను, మూర్ఛలోనూ, గుర్రంమీదా తప్ప, స్త్రీపురుషుల్ని దగ్గిర చేర్చకూడదు.

రచ — పోనీ యీస్వగతం యిక్కడికి ఆపి రంగోది చదువుతాను వినండి.

"హాఖడ్గరాజమా ! నీవే వీరాతివీరుల ‥

సం — యిట్లాటివి చాలా చదివానండీ నాకు తెలుసు. తరువాత చెప్పండి.

రచ — ఆస్వగతం తరవాతం "అట్లు గంభీరవచనంబుల నుచ్చరించి, ఆకరవాలంబు నారామణీయమణిమయశిలామయ ప్రదేశంబుననునిచి అర్ఘ్య పాద్యాది పీఠంబుల పుష్పమాల్యాది లేపనంబులం బూజించి, బ్రాహ్మణ సంతర్పణంబుగావించి, "హా ఉజ్జయినీపుర పాలకా, నరవీరసింహా" యని పలుసార్లుచ్చరించి కరవాలంబును హృదయంబున కేమసార్లుగురిచేసి, సాహసించి, నిశ్చయించి, పొడుచుకొనబోవు దంతలోన వెనకనించి కాషాయవేషధరుండగు నొకవీరపురుష వరేణ్యాపుండరీకం బామె కరంబుంబట్టి ఆఖడ్గంబును లాగివైచునంతలో నామె వెంటనే, సహజముగ్ధత్వం బుప్పొంగ, అతనియొక్క మూపై సెమ్మదిగ వ్రాలి, త్వరితంబుగ మూర్ఛం మునింగె.

అల్లాంటి పాడుపుస్తకాలు చదివి మన స్త్రీలందరూ ఆనాయికల్ని ఆదర్శంగా తీసుకొని బోర్లపడుతున్నారు. ఆకాలంలో పీకుడు అబలలకి తోడ్పడడం సహజం. యెంత రక్షించినా, పరపురుషుణ్ణి రాచస్త్రీ పలకరిస్తుందా? అసలు కన్నెత్తి చూస్తుందా?

సంపా—అయితే మరి వీళ్లద్దరికి మోహామేర్పడదా యేమిటి యీకథలో?

రచ—యేర్పడకేం? అదెట్లా తప్పుతుంది? లేకపోతే కథయేదీ?

సంపా—ఒకరినొకరు చూడకుండానే?

రచ—అదే మనవాళ్లుపడే గొప్పపొరబాటు. అందునా, ప్రతివాడూ మోహామేర్పడ్డానికి ఒకరి నొకరు చూడాలా? చూస్తే యేం తెలుస్తుంది? అనురాగమంటే, యిదా అర్థం? పాశ్చాత్యుల పుస్తకాల్లో "లవ్ ఎట్ ఫస్టుసైట్" అట్లాంటివి చదివి భ్రమపడి, రాసే రాతలివి. దమయంతి నలుణ్ణి చూసేవొలిచిందా; బ్రాహ్మలవల్లా, హంసవల్లా, అతని సద్గుణాలు విని. రాముడు విల్లు విరిచింతరవాత, వీడు నల్లగావున్నాడు నాకు వద్దు-బా సీత? ముక్కెట్లాగావుంటేనేం, కాలెట్లావుంటేనేం, బుద్ధిమంతుడై వుండాలి గాని!

యీవిషయమై తెలిసేటట్టు వ్రాశాను. యీనాల్గోప్రకరణంలో 'పాఠకమహాశయులారా! యిరువురు నొకరి నొకరు వీక్షించుకొననే యేవిధంబున కామించుకొనిరని మీరలు సందేహింతురేమో? కాని మీరాలోచించి చూడుడు. యీనాటికిని యుక్త్యుక్తంబగు మన మహాహిందూమత సాంప్రదాయమట్టిదే గదా! మనదేశంబున గుణంబును, వంశంబును ప్రాముఖ్యంబులుగాని తుచ్ఛంబును అస్థిరంబునగు శరీరంబు కాదుగదా! ఇంకను...

సంపా—తరువాత కథ చెప్తూ మానకండి. నాయికా నాయకు లిద్దరూ చూసుకోకుండానే యెవరితోవన వారు వెళ్లారు. తరవాత—

రచ—ఆ అశ్వపదఘట్టనకు ... మిన్నులంటు పచ్చికను మేయు లేళ్లను లేళ్లను తిను తోడేళ్లను తోడేళ్లందినను పులులను పులుల వేటాడు వేటగాండ్రను వేటగాండ్రను గరుచు పాములను పాములం భక్షించు నెమళ్లను వారింప సాగు రుషికన్యలను ఆకన్యలం కామించు...

సంపా—చాలు బాబూ.

రచ—మీకీవర్ణన లేమీ రుచించటం లేదు.

అప్పుడు అయిదో ప్రకరణం మొదలు. దీనిలో అమరపురాధీశుడైన వీరసేనుని మూడవకుమార్తె.

సంపా—చదువుతున్నారా? చెప్తున్నారా?

రచ—చెప్తున్నాను. పోనీ. చదవనా?

సంపా—వొద్దు. వొద్దు. చెప్పేప్పుడు ఆపుస్తకం భాషెందుకు? నోటిమాటలతో రానిద్దురూ.

రచ—బాగా ఆభాష అలవాటైపోయిందండీ.

సంపా—మీరుండండి. నేను చెప్తాను. "ఆ అయిదో ప్రకరణంలో ఆజ్యోతి" విరహతాపం పడుతో వుంటుంది.

రచ—కాదు. జ్యోతికాదు. 'విమల' విరహతాపం పడుతో వుంటుంది.

సం—యీవిమల యెవరు?

రచ—అదే చమత్కారం యీనవలలో.

సం—సరే. ఆవిమల తన అంతఃపురమందిరపు యేడో అంతస్తుమీదనుంచుని ప్రలాపిస్తోవుంటుంది. ఆమెని వివాహమాడాలని సింహగడ దుర్గాధీశుడూ, ఢిల్లీపాదుషా, కొండవీటిరెడ్డి, దండకారణ్యపు తోడాలమల్లుడూ ఆమె సౌందర్యప్రకీర్తి విని కోట ముట్టడేశారు. ఆమె తండ్రి వీళ్లలో యెవరినీగాక యింకోరిని వివాహమాడమంటాడు.

కాని యీకన్య హృదయం మాత్రం పంపానదీతీరమున స్నానం చేస్తో యెవరి మీసపు వెండ్రుకని చూచిందో ఆరాకుమారుడితో లగ్నమయింది.

రచ—కాదు. ఆనాడు తనని కిరాతుల నుంచి కాపాడిన మహీరుహుం డెవ్వండో ఆనరసింహుని

సం—ఆ—ఆమె యెవరో జ్యోతి అన్నారుకదూ ?

రచ—నేన సందే ! అదే యీనవలలో చిత్రం ; ఆవీరుడికి బోయలు తప్పచెప్పారు- ఆమె విలాపం వినండి.

“ఓహో దైవటిదైవమా ! హతవిధీ ! నిన్నేమందురా? నేనేల అరణ్యాంబునకుం బయలుదేరితి. దేరితిబో ! నన్నా కిరాతులు ముట్టడింపనేల ? డించిరిబో ! నేనేల మొరలిడవలె ? యిడితిబో ! ఆరాకొమరుం డాదారిని బోవనేల ? బోయెనుబో! ...

సం—తరవాత తెలిసిందేగ ...

రచ—వినండిమరి.

సం—తరువాత నన్నుకొంచెం చెప్పనీండి. “యేల వినవలె ? వినెనుబో యేల రావలె ? వచ్చెను బో, యేలవీర్యము చూపవలె ? చూపెనుబో, నేనేలమోహనైతి? ఇట్లానేనా ?

రచ—అట్లానే ?

సం—యింకోటి, మీరుశృంగారరసం యెక్కువచేశేసారు. అవన్నీ యీకాలానికి సరిపడవు. రెండుగజాల దూరంనించి, నుదురుమీద ఒక్క ముద్దుపెట్టించడంకన్న, యింకదగ్గిరిగా యేపనీ జరిపించకూడదు. యేపత్రికన్నా “పచ్చిశృంగారమని విమర్శించిందంటే, యింక మనపని సున్న.” స్వప్నంలోను, మూర్ఛలోనూ, గుర్రంమీదా తప్ప, స్త్రీపురుషుల్ని దగ్గిర చేర్చకూడదు.

రచ—పోనీ యీస్వగతం యిక్కడికి ఆపి గద్యం చదువుతాను వినండి.

“ హాఖడ్గరాజమా ! నీవే వీరాతివీరుల· --

సం—యిట్లాటివి చాలా చదివానండీ. నాకు తెలుసు. తరువాత చెప్పండి.

రచ—ఆస్వగతం తరవాతం “అట్లు గంభీరవచనంబుల నుచ్చరించి, ఆకరవాలంబు నారామణీయమణిమయశిలామయ ప్రదేశంబుననునిచి అర్ఘ్యపాద్యాది విధంబుల పుష్పమాల్యాది లేపనంబులం బూజించి, బ్రాహ్మణ సంతర్పణంబుగావించి, “హా ఉజ్జయినీపురపాలకా, నరవీరసింహా”యని పలుసార్లుచ్చరించి కరవాలంబును హృదయంబున కేనుసార్లుగురిచేసి, సాహసించి, నిశ్చయించి, పొడుచుకొనబోవు దంతలోన వెనకనించి కాషాయవేషధరుండగు నొకవీరపురుష వరేణ్యపుండరీకుం [illegible]మె కరంబుంబట్టి ఆఖడ్గంబును లాగివైచునంతలో నామెవెంటనే, సహజమగ్ధత్వాం బుప్పొంగ, అతనియురముపై సెమ్మదిగ వ్రాలి, త్వరితంబుగ మూర్ఛం మునింగె.

# ముర్తజాన్నగర్ సర్కార్.

మనలో చాలామందికి హిందూదేశచరిత్రకంటే ఇతరదేశాల చరిత్రలు ఎక్కువ బాగా తెలుసును. అందులోనూ, ఆంధ్రదేశ చరిత్రకంటే మహారాష్ట్ర రాజపుత్ర శిక్కుచరిత్రలు బాగా తెలుసును. నిజానికి, శాతవాహనులు, పల్లవులు, చాళుక్యులు, వీరంతా మొన్న మొన్నటి వరకూ మనపరిచితులే కారు. ఇప్పుడైనా విద్యానగర సామ్రాజ్యము అంతరించేవరకూ ఏవో అతుకులతో ఆంధ్రచరిత్ర చదువుతున్నాము; కాని తరువాత మూడు శతాబ్దాలచరిత్ర బొత్తుగా గమనించడమే లేదు.

ఆమహాసామ్రాజ్యములోనుంచి చీలిపోయిన మధురతంజావూరు నాయకుల ప్రతిభ మనమంతగా ఎరగము. గోలకొండ సుల్తానుల వైభవము, రసికత, మనము మరిచిపోయినాము. విజయనగరము గజపతులు, బొబ్బిలిరంగారావులు, పిఠాపురము జగపతులు, నూజవీటి అప్పారావులు, తమస్వాతంత్ర్యమును కాపాడుకోడానికి మహమ్మదీయసుబేదార్లతోను, పరాసు ఆంగ్లకంపెనీలతోను, కావించిన యుద్ధాలు, అందులో వారుచూపిన శౌర్యపరాక్రమాలు, ఏమారుమూలదస్తావేజులలోనో ప్రాతపుస్తకాలలోనో మాటుపడి ఉన్నవి.

ఈమూడువందల సంవత్సరాలలో క్రమంగా ఆంధ్రదేశము స్వదేశీయులైన హిందూమహమ్మదీయ ప్రభువుల చేతిలోనుండి జారిపోయి, విదేశీయ కంపెనీల ఏలుబడిలోకి ఏవిధంగా పోయినదో మనము గమనించాలి. విదేశభాష, సభ్యత ఆచారవ్యవహారాలు, దేశములో ప్రవేశించడమువల్ల మనలో కలిగిన మార్పులేవి? వీటివల్ల మనకేమి మేలు కలిగినది? అనేసంగతులు కూడా విచారించాలి.

ఈకాలపుచరిత్రకు శాసనపరిశోధనకాని ప్రాచీనభాషలతో పరిచయముగాని అవసరము లేదు. కొంచెము ఓపికతో ప్రాతఉత్తరాలు, సంధిఒడంబడికలు, కంపెనీ ఫ్యాక్టరీల రికార్డులు, జిల్లామాన్యువలులు, మిల్లు ఓర్మెమొదలైన చరిత్రకారుల గ్రంథాలు పరిశీలించితే చాలు. అందుకనే ఈప్రాతపురాణాలు వెతికి, అప్పుడప్పుడు మన దేశానికి సంబంధించిన చరిత్ర సులభముగా అందరికీ తెలిసేటట్టు వ్రా

యాలనకున్నాము. ఈవ్యాసములో ముర్తజాన్నగర్ [కొండవీడు] సర్కారు నైజామునద్ద ఆంగ్లేయకంపెనీవారు తీసుకున్న కథాక్రమము వర్ణించాము. ]

## ఉత్తర సర్కారులు.

తూర్పుసముద్రతీరాన ఓఢ్రదేశానికి దక్షిణముగా గుండ్లకమ్మవరకూ వ్యాపించి ఉన్న ప్రాంతమును ఉత్తరసర్కారు లంటారు. ఇదిచరిత్రలో ప్రసిద్ధమైనది. ఇప్పుడు మనము దీనినంతా ఆంధ్రదేశమనే వాడుతున్నాము. కాని పూర్వము కళింగము, వేంగీ, వెలనాడు, మొదలైన భాగాలుగా ఉండేది. మహామహులైన రాజు లనేకులు దీనిని పాలించారు. సాతవాహనులు, పల్లవులు, తూర్పుచాళుక్యులు, కాకతీయులు, రెడ్డిప్రభువులు, ఇందులో ఏవోకొన్ని ప్రాంతాలు తమ ఏలుబడిలో ఉంచుకున్నారు. కళింగము, రాజమహేంద్రవరము, పెదవేగి, కొండవీడు, అమరావతి, రాజధానులుగా ఉండి మహావైభవము అనుభవించినవి.

శ్రీకృష్ణదేవరాయలు సింహాచలమువరకూ ఒకప్పుడు ఆక్రమించుకున్నాడు. కాని త్వరలోనే సంధిచేసుకుని, కృష్ణకు ఉత్తరంగాఉండే దేశమంతా ఓఢ్రగజపతులకు వదలివేశాడు. గోలకొండకుతుబుషాలు, ఓఢ్రరాజులు, దీనికై అంతులేని యుద్ధాలు చేశారు. కొండపల్లి కొండవీడు దుర్గాలు ఎప్పుడూ రణరంగాలే.

17-వ శతాబ్ది ప్రారంభములో, ఉత్తరసర్కారులు చాలావరకు గోలకొండ రాజ్యములో చేరిపోయినవి. ఆసుల్తానుల ప్రాపకము సంపాదించుకొని, పరాసు ఆంగ్లకంపెనీలు బందరు మొదలైన రేవుపట్టణాలలో గిడ్డంగులుకట్టి వర్తకము సాగించారు. ఇంతలో గోలకొండ రాజ్యము నాశనమైనది. ఔరంగజేబు పాదుషా తానాషాను ఖైదుచేసి, అతనిరాజ్యమును ఢిల్లీసామ్రాజ్యములో కలుపుకున్నాడు. (1687) తనపక్షమున పాలించడానికి సుబేదార్లను నియమించాడు. ఆపాదుషా 1707లో చనిపోయినతరువాత చక్రవర్తుల ప్రతిభ నానాటికితగ్గి దూరప్రాంతాలలో పాలించే సుబేదారులంతా స్వతంత్రులైనారు. వీరు లాంఛనానికి చక్రవర్తి అధికారమును అంగీకరించేవారు. అతనివద్ద బిరుదులు స్వీకరించేవారు. ఒక సుబేదారు చనిపోయి, క్రొత్తసుబేదారు ఆపదవిని పొందేటప్పుడు చక్రవర్తి ఉత్తరువు తెప్పించుకొనేవారు; కాని, ఇదంతా ఒకనాటకముగా ఎంచవలసినదే.

ఈవిధముగా తక్కినసుబేదార్లతోపాటు ఇప్పటినైజాముల పూర్వికుడు (అసాఫ్‌జా) నైజాముల్‌ముల్కు కూడా స్వతంత్రుడై చాలా చాకచక్యముతో పాలించాడు. అతడు 1748లో చనిపోగానే, దక్కను సుబేదారుపదవికై పోరాటము సంభవించినది. అప్పుడే దక్కను సుబేదార్లక్రిందబడ్డ కర్ణాటదేశమును పాలించే నవాబుపదవిని గురించికూడా తగాదాలు బయలు దేరినవి. ఉభయపక్షాల వారూ, పరాసు ఆంగ్లకంపెనీల సహాయముతో జయము పొందడానికి పూనుకున్నారు. ఆరోజులలో పాశ్చాత్యులు ఫిరంగులు తుపాకీలు కాల్చడములో చాలా ప్రవీణులు. మనవాళ్లకు బాహుబలము యుద్ధశాస్త్రములు ఎంతఉన్నా, ఫిరంగుల ఆధిక్యమువల్ల వారు మనదేశీయులను సులభముగా ఓడించేవారు. అంతేకాకుండా ఈదేశపుసైనికులనే, వేలకొద్ది తమ కొలువులోకి తీసుకుని, వారికి క్రొత్తపద్ధతిగా కవాతునేర్పి వారిమూలముగా జయము సంపాదించేవారు. యుద్ధాలకు అయ్యే వ్యయమంతా దేశీయప్రభువులదే. సైన్యబలము చాలావరకు దేశీయులదే. ఈవిధముగా దేశీయప్రభువుల కొట్లాటల మూలముగా వీరు క్రమంగా రాజ్యము సంపాదించడము ప్రారంభించారు.

పరాసు ఆంగ్లకంపెనీలకు కొంచెమెచ్చుతగ్గుగా 1749 మొదలు 1761వరకూ జరిగిన యుద్ధపరంపరనుగూర్చి ఇక్కడ వ్రాయ దలచుకోలేదు. అదంతా పెద్ద భారతమంత గ్రంథముగా ఓర్మ్ వ్రాశాడు. తమదేశీయులు స్వల్పస్థితిలోనుండి క్రమంగా సామ్రాజ్యపదవికి ఎట్లా వచ్చారో తెలుసుకుని ఆనందించడానికి ఆంగ్లేయులు ఆ గ్రంథము చదువుతారు. తమశక్తిసామర్థ్యాలవల్ల రాజ్యము సంపాదించలేక విదేశీయుల సహాయ్యమును కోరి, వారికి వశవర్తులై పోయి, రాజ్యములో మంచిప్రాంతాలన్నీ వారికి కట్టిపెట్టిన వాళ్ళలో కర్ణాటనవాబు ముఖ్యుడు. అతని పేరు మహమ్మదల్లీ. అతడు ఆంగ్లేయులకు మొదటిబంటు. ఆవిధంగానే దక్కను సుబేదారైన సలాబతుజంగు పరాసులకు బంటు. ఆంగ్లేయసేనల తోడ్పాటులేకుండా తనక్రింది జాగీరు దార్లవద్ద శిస్తులైనా వసూలు చేసికోలేనివాడు మహమ్మదల్లీ. పరాసుసేనానాయకుడగు 'మూసా బుస్సీ' కొంతపరివారముతో తనఆస్థానమును కనిపెట్టుకొని ఉండకపోతే, తన సర్దారులో, మహారాష్ట్రులో, తన్ను పదభ్రష్టుని చేస్తారేమో అని ఎప్పుడూ దిగులు పడే మహానుభావుడు సలాబతుజంగు. ఇక చెప్పవలసిన దేమున్నది? కర్ణాటములో తమసైన్యాలమూలముగా శిస్తులు వసూలుపరచి, ఆధనములో విశేషభాగము తమ ఖర్చులక్రింద పుచ్చుకునే వారు ఆంగ్లేయులు. దక్కను సుబేదారుకు ఎప్పుడూ సైన్యముతో తోడ్పడినందుకు బదు

లుగా నిక్షేపమువంటి ఉత్తర సర్కారులు బహుమతిగా పొందినవారు పరాసులు. అందువల్లనే 1753 మొదలు 1759 వరకూ పరాసులు అవిచ్ఛిన్నముగా ఉత్తర సర్కారు లనుభవించి రంగారావు వంటి వీరపుంగవులను తుదముట్టించారు. 1759 లో కర్నల్ ఫోర్డు అనేఆంగ్లసేనాని పరాసులవద్దనుంచి బందరుకోట పట్టుకుని పరాసులను పూర్తిగా ఉత్తర సర్కారులనుంచి పారదోలినాడు. పూర్వము విజయనగర రాజైన విజయరామరాజు బుస్సీకి చాలాతోడ్పడి ఉత్తరసర్కారు లతనికి స్వాధీనము చేయించాడు. అతనిపిమ్మట రాజైన అతనిదాయాది ఆనందరాజు అదేవిధంగా కర్నల్ ఫోర్డుకు సహాయముచేసి పరాసులను ఈదేశములోనుంచి పారదోలించాడు. అంతటితో ఏరేవుపట్టణాలో మాత్రము ఆంగ్లేయకంపెనీకి వదలి మిగిలిన దేశమంతా తానే మహారాజుగా పాలించవచ్చు నని భ్రమపడినాడు !

పరాసుపరివారము దక్కను వదలగానే సలాబతుజంగును అతని తమ్ముడగు నైజామల్లీ ఖైదుచేసి తరువాత చంపి తానే సుబేదారైనాడు. ఏవిధముగానైనా ఉత్తరసర్కారులు కౌలుకు తీసుకుని అనుభవించాలని ఆంగ్లేయుల ఉద్దేశ్యము. నైజామల్లీకి సైన్యసహాయము చేసేటట్లున్నూ, సంవత్సరానికి 9 లక్షలు కప్పమిచ్చేటట్లున్నూ ఒప్పుకుని సంధిచేసుకున్నారు [1766]. ఈసందర్భములో ఉత్తరసర్కారులకు సంబంధించిన రాయబారాలూ విచిత్రఘటనలూ పెద్దకథ ఉన్నది. ప్రస్తుతము కొండవీడుసర్కారును గురించి మాత్రమే వ్రాస్తున్నాము. తక్కినచరిత్ర ప్రత్యేకముగా ఇంకోసారి వ్రాస్తాము.

## కొండవీడు సర్కారు.

దీనికే మహమ్మదీయప్రభువులు ముర్తజానగరని పేరుపెట్టినారు. సాధారణముగా గుంటూరుసర్కారని కూడా వ్యవహరిస్తారు. ఇందులో కొండవీడు, బెల్లంకొండ, వినుకొండ, అనే ప్రసిద్ధ దుర్గము లున్నవి. వాసిరెడ్డివారు మల్రాజువారు మానూరివారు జమీందారులై పెద్ద పెద్ద పరగణాలను పాలించేవారు. ఆరోజులలో పల్నాడుమాత్రము కర్ణాటనవాబులకులోబడి ఉండేవి. మిగిలిన జిల్లా [లేక సర్కారు] దక్కను సుబేదారుదే. కొండవీడులో ఫౌజుదారు ఉండి సుబేదారు తరఫున పాలించేవారు.

1766 లో కంపెనీ వారికిని సుబేదారైన నైజామల్లీకిని జరిగిన సంధి ప్రకారము కొండవీడు సర్కారుకూడా కంపెనీస్వాధీనము కావలసినదే. కాని నైజాము

అన్నగారైన "బసాలతుజంగు" దానిని జాగీరుగా అనుభవిస్తున్నాడు. అందువల్ల బసాలతుజంగు జీవించి ఉన్నంతవరకూ అతనికే ఉండి, తిరువాత కంపెనీవారికి వచ్చేటట్టు ఏర్పాటు చేసుకున్నారు. ఒకవేళ బసాలతుజంగు కంపెనీవారి శత్రువర్గములో చేరి, కంపెనీరాజ్యానికి అపకారము చేసినట్టయితే, నైజాము అతనిని తొలగించి, ఆజిల్లాను కంపెనీవారికి స్వాధీనపరచవలసిన దనికూడా అనుకున్నారు.

శ్రీకాకుళము, రాజమహేంద్రవరము, ఏలూరు, ముస్తఫానగర్ (కొండపల్లి) సర్కారులు కంపెనీవారికి వచ్చినవి. అంటే, కృష్ణకు ఉత్తరంగా ఉన్న సముద్రతీరమంతా వారిదే. ఇక, గుండ్లకమ్మకు దక్షిణముగా ఉన్న రాజ్యమంతా కర్ణాటకనవాబులది. నిజానికి, కంపెనీవారే ఆదేశమంతా పాలిస్తూ, నవాబును కేవలము బొమ్మను చేశారు. కృష్ణా గుండ్లకమ్మలకు మధ్యగాఉన్న కొండవీడు సర్కారు మాత్రము పరాయివాళ్ల చేతులలో ఉండడము కంపెనీవారి కిష్టము లేదు. పైగా, బసాలతుజంగు కొండవీటిలో తనకు సహాయ్యముగా కొంతపరాసుల సైన్యము ఉంచుకున్నాడు. మోటుపల్లిరేవులో క్రొత్తగా అనేకమంది సైనికులు దిగి కొండవీడు చేరుతున్నారు. ఆంగ్లసైన్యములోనుండి పారిపోయినవాళ్లు [వీరిని 'డిజర్టర్స్' అంటారు] కొండవీటిలో శరణుపొందుతున్నారు. తిరుగు బాటుచేసిన జమీందార్లు, ఇతరనేరస్థులు కూడా క్రమంగా చేరుకుంటున్నారు. తమ రాజ్యానికి అశాంతికలుగుతుందని, బసాలతుజంగును మందలించి పరాసు సైనికులను వెడలగొట్టించవలసినదనీ, కంపెనీవారు నైజామును కోరినారు. కాని, బసాలతుజంగు అతని మందలింపులను లక్ష్యపెట్టలేదు. సంధిషరతుల ప్రకారము జిల్లాను స్వాధీనపరుచుకుందామంటే, ఆషరతులకు వ్యతిరేకముగా బసాలతుజంగు ప్రవర్తించినట్లు ఋజువేమీ లేదు. పోనీ, బసాలతుజంగువద్దనే కొండవీడు కౌలుకు తీసుకుని, అతనికి ఆంగ్లసైన్యములు తోడ్పడేటట్టు ఏర్పాటు చేసుకుందామంటే, బసాలతుజంగు అంగీకరించలేదు. చివరకు 1779 ఫిబ్రవరి నెలలో బసాలతుజంగు సంధికి ఒప్పుకున్నాడు. మైసూరు ప్రభువైన హైదరల్లీ తన దేశముమీదికి వస్తాడని అతనికి భయము కలిగినది. ఆదవానిదుర్గము కాపాడుకోడానికి అతను కొండవీడు వదలివెళ్లిపోయినాడు. ఈలోపుగా అతడులేని అవకాశము చూచుకుని జిల్లాలోని కొన్ని ప్రాంతాలు ఆంగ్లేయు లాక్రమించుకున్నారు. అందులో ముఖ్యముగా వేటపాలెము మొదలైన ఉప్పుపట్టణాలు పట్టుకుని, సముద్రముమీద కొండవీటికి వచ్చే ఆయుధసామగ్రిని వశపరచుకున్నారు. ఈకారణాలవల్లనే బసాలతుజంగు భయపడి సంధిచేసుకున్నాడు.

జిల్లాను ఆంగ్లేయులకు కౌలుకిచ్చేటట్లున్నూ, పరాసు సైనికులను వెడలగొట్టి, ఆంగ్ల సైనికులకు స్వీకరించేటట్లున్నూ, అంగీకరించాడు

సర్కారు మరొక సంగతి గమనించాలి. బసాలతుజంగు నైజాము వంశము లోనివాడు. అతనికి లోబడి జాగీరు అనుభవిస్తున్నాడు. ఇంతకు పూర్వము జరిగిన సంధులన్ని కంపెనీవారికిన్నీ నైజాముకున్నూ జరిగినవే కాని బసాలతుజంగుకు వాటితో సంబంధము లేదు. ఏలిక అనుమతిలేకుండా, సామంతుడితో ఈవిధముగా సంధిచేసుకోవడము రాచమర్యాదలకు విరుద్ధము. సంధి వ్రాసుకున్న వెంటనే తమ సైన్యాలను పంపి ఆంగ్లేయులు కొండవీటిసర్కారును ఆక్రమించుకోవడమూ, పైపెచ్చు తనఅన్నగారికి ఆంగ్లసైన్యముల తోడ్పాటు ఇవ్వడమూ, చూచి నైజాము ఉగ్రుడైనాడు. ఒకవేళ తనఅన్నగారు తనమీద తిరుగుబాటు చేయదలిస్తేనా ఈ ఆంగ్లసైన్యములు తోడ్పడునని అతడనుకున్నాడు. ఈ సందర్భాలన్నీ తనకు తెలియచేయడానికి తనదర్బారుకు వచ్చిన "హాలండు"ను మందలించాడు. గుంటూరు సర్కారు ఆక్రమించుకోవడముతో తృప్తిపొందక, కంపెనీవారు తాము ఉత్తర సర్కారుల కప్పముక్రింద ఇవ్వవలసిన బాకీ రద్దుపరచ వలసినదని కూడా కోరినారు. "మీకు నీతిలేదా? సంధిషరతులను పాటించాలని ఉద్దేశించరా?" అని నైజాము ఆగ్రహించాడు. "ఈకథంతా చెన్నపట్టణము గవర్నరు, కవున్సిలు, జరిగించారు. మాకేమీ తెలియదు. మేము ఆమోదించలేదు. గుంటూరు సర్కారును మీకే వదలివేస్తాము" అని కలకత్తానుంచి గవర్నరుజనరలు హేస్టింగ్సు క్షమాపణ చెప్పుకుని, అప్పటికి నైజామును తృప్తిపరచాడు. చెన్నపట్టణపు ప్రభుత్వమును గట్టిగా చీవాట్లుపెట్టినాడు గుంటూరునుండి ఆంగ్లసైన్యములను తీసివేసి,గుంటూరు బసాలతుజంగుస్వాధీనము చేయవలసినదని ఆజ్ఞాపించాడు. కాని, చెన్నపట్టణము వారట్లా చేయలేదు. ఈసంగతి ఇంగ్లండులో ఉన్న కంపెనీ అధికారులకు తెలిసి చెన్నపట్టణము గవర్నరును, కౌన్సిలర్లను, ఉద్యోగాలలో నుంచి తప్పించి యథాప్రకారముగా గుంటూరు నైజాముకు ఇవ్వవలెనని ఆజ్ఞయిచ్చారు. (1780) అంతేకాకుండా "దేశీయప్రభువులతో రాయబారాలు నడపడమంటే మీకింత కుతూహల మెందుకు? కంపెనీకి రాగల లాభముకంటే, మీకు (లంచాల మూలముగా) ఏదో వేరేలాభ మున్నట్లు మాకు అనుమానము" అన్నారు.

కంపెనీవారైనా, గుంటూరుసర్కారును తాము అనుభవించక, తమ స్నేహితుడైన ఆర్కాటు [అనగా, కర్నాటక] నవాబుకు ఇచ్చివేశారు. ఆరోజులలో

కంపెనీ ఉద్యోగస్థులు, వర్తకులు, ఆర్కాటు నవాబువంటి భోగలాలసులకు విరివిగా అప్పులు పెట్టేవారు. ఆ బాకీలు రాబట్టుకోడానికి, నవాబు రాజ్యములో ఏవో కొన్ని జిల్లాల మీద వచ్చేశిస్తులు తాము వసూలుచేసుకునేవారు. వీరికి రైతులు క్షేమముగా ఉండాలనీ, భూములు బాగుపడాలనీ, ఆలోచన ఎంతమాత్రమూ లేదు. అతిక్రూరముగా తమపైకము రాబట్టుకొన ప్రజలను హింసించేవారు. ఈ చిత్రగాథలన్నీ ఒకప్పుడు పార్లమెంటులో చర్చకు వచ్చి, వారు తీవ్రంగా తమ దేశీయులను మందలించారు. గుంటూరుసర్కారుకూడా, అదేవిధముగా కొన్నిసంవత్సరాల వరకూ, ఆర్కాటునవాబు అప్పులవాళ్ల చేతిలోపడ్డది.

1782 లో బసాలతుజంగు చనిపోయినాడు. ఇంతటనైనా, తమకోరికలు కొనసాగి, గుంటూరుసర్కారు తమస్వాధీన మవుతుందని కంపెనీవారనుకున్నారు. కాని, ఉత్తరసర్కారులకప్పము కాకుండా ఉండడమూ, టిప్పుసుల్తానుతో యుద్ధములు జరుగుతు ఉండడమూ అంతా ఆలోచించి గవర్నరుజనరలైన "కారన్‌వాలీసు" కొంతకాలము వరకూ ఆగితే బాగుంటుందనుకున్నారు. 1788 లో ఈవ్యవహారాలన్నీ పరిష్కారము చేయడానికి చెన్నపట్టణమునుంచి "కెన్నవే" అనే ఉద్యోగస్థుని హైదరాబాదుదర్బారుకు పంపినారు. ఏదో నెపము మీద ఆంగ్లసైన్యములను గుంటూరుకు సమీపములో ఉంచారు. నైజాము అంగీకరించక పోయినా, బలవంతముగా నైనా గుంటూరు స్వాధీనపరచుకోవడానికి గవర్నరుజనరలు సంకల్పించారు. కాని, దీనికొరకై నైజాముతో యుద్ధానికి దిగడానికి అతనికీ సంశయమే కాబట్టి "కెన్నవే" చాలా జాగరూకతతో ప్రవర్తించవలసినదనీ, ఒకవేళ నైజాము ఆగ్రహించి నాలుగుమాటలన్నా సహించవలసినదనీ బోధించారు. ఇందుమూలముగా యుద్ధమే సంభవిస్తుందేమో అనే అనుమానము కలిగేటట్టయితే, ఈసంగతి ప్రస్తుతా వదలివేసి ఏవో లాంఛనముగా మాటలు చెప్పి తిరిగిరావలసినదనికూడా చెప్పారు.

కాని, దైవవశాత్తు నైజాము సులభముగానే గుంటూరు సర్కారును వదలిపెట్టడానికి అంగీకరించాడు. దీనికి నైజాము దౌర్బల్యమే కారణము. ఒకవైపు మహారాష్ట్రులూ, ఇంకొకవైపు టిప్పుసుల్తానూ [మైసూరురాజు], ఎప్పుడు తన రాజ్యముమీదవచ్చి పడతారోనని అతనికి భయము. కాబట్టి ఏవిధముగానైనా ఆంగ్లేయులతో స్నేహముగా ఉండడము అతనికి తప్పనిసరి. అంతేకాకుండా, గుంటూరు సర్కారునుంచి రావలసిన శిస్తుపైకము క్రమముగా వసూలు కావడములేదు. జిల్లా

అంతా అరాచకస్థితిలో ఉన్నది. ఆంగ్లేయులకు ఒప్పగించినందువల్ల నష్టమేమీ లేదనుకున్నాడు. ఇన్నిసంవత్సరాలనుంచీ కంపెనీవారు ఉత్తరసర్కారుల కప్పము క్రింద నైజాముకు ఇవ్వవలసిన బాకీకిన్నీ, బసాలతుజంగు చనిపోయిన పిమ్మట కూడా 1782 మొదలు 1788 వరకూ గుంటూరు సర్కారుకంపెనీవారి స్వాధీనం చేయకుండా నైజాము అనుభవించినదానికిన్నీ సరిపెట్టుకున్నారు. వెంటనే నైజాము గుంటూరు సర్కారులో తనతరఫున ఉన్న సైఫుజంగు మొదలైన ఉద్యోగస్థులకు తాకీదులు పంపాడు. వాటి ననుసరించి 1788 లో తక్కిన ఉత్తరసర్కారుల తోపాటు గుంటూరుకూడా కంపెనీవారి స్వాధీన మైనది.

కోలవెన్ను రామకోటీశ్వరరావు.

# రాజమహేంద్రవరంపు సర్కారు ఏలుబడి.

శ్రీకులోత్తుంగచోడమను మహా గాంగ రాజుకుమారుడు ఫృ. పశ్చిమ వాహా రాజ ముప్ఫయిఅయిదు సంవత్సరములు రాజ్యంచేసినాడు. తరువాత చాళుక్యవంశ సంభవుడయిన మల్లప దేవచక్రవర్తి వేంగీదేశానకు అధిపతియై పదిసంవత్సరములు వేంగీదేశానకు రాజరికం చేసినాడు అటుతరువాత సూర్యవంశోద్భవుం డైన అన్నయదేవమహారాజు రాజమహేంద్రవరం పట్టంకట్టుకుని ముప్ఫయి సంవత్సరములు రాజరికం చేశినాడు. తరువాత ఆయన కొమారుడు అన్నయ దేవభూపాలుడు రామవరం పట్టణము పట్టాభిషిక్తుడై భీమవోలుశీమ గోదావరీ తీరము మొదలుకొని తూర్పున కోనశీమయంతము రాజరికం చేసినాడు. యీయన ముప్ఫయిసంవత్సరములు ప్రభుత్వము చేశినాడు. తరువాత వేంగిదేశం రెడ్లవారి స్వాధీన మైనది. యీరెడ్లవారు రామాపురపు దుర్గంమీదవున్న అన్నయదేవ భూపాలుణ్ని కొట్టివేశినారు. ప్రోలయ వేమారెడ్డిగారు అనపోత వేమారెడ్డి పెద్ద వేమారెడ్డి కోమటి వేమారెడ్డి రాజ వేమారెడ్డి వీరు క్రమపూర్వకముగా నూరు సంవత్సరములు ప్రభుత్వము చేసినారు తరువాత కటకశింహాసనాధీశ్వరులయిన వీరనరశింహ లాంగూల గజపతి కపిలగిమున్నా ఆంధ్ర దేశముకూడా ప్రభుత్వము చేశినా రని చెప్పుతారు. తరువాత ప్రతాపరుద్ర గజపతి శ్రీకాకుళం రాజమహేంద్రవరం యేలూరు కొండపల్లి మొదలుకొని పడమట వుదయగిరి పర్యంతము రాజరికం చేశినాడు. యీయనకు పేరే హంవీరగజపతి అని చెప్పుతారు. తరువాత యీయన కొమారుడు ముకుంద దేవు గజపతి రాజమహేంద్రవరము యేలూరు కొండపల్లి పర్యంతము పడమట దేశంసహా రాజరికం చేస్తూ కటకపట్నము లో సింహాసనస్థుడై వుండెను. ముకుంద దేవు గజపతిగారి మేనల్లుడు రాజవిద్యాధరుడు. యీయన భోగాశీశ్చంద్రుడు అనే ఆయన రాజమహేంద్రవరం సర్కారుకు నిఘావానీ చేస్తూ వుండెను.

ఇంతకు పూర్వము శ్రీమన్మహామహాకురువరప్రసాద శ్రీవీరకపిలేశ్వర గజపతి దేవుమహారాజులుంగారు కటకశింహాసనస్థులై పృథివి యేలుచునుండి వున్నప్పుడు దేవువారి సన్నిధానమందు బహుదినముల నుండి ఆశ్రయించుకుని వున్నటువంటి

బ్రాహ్మణుడు నియోగి నిశ్శంకులనాయన అనేఆయనతోటను వకనాటికాలమునకు ప్రభువువారికి అపరిమితమైన అనుగ్రహము వచ్చి నీవు యేమికావలెనో కోరుకుంటే దయచేయిస్తా వున్నామని వరము దయచేసి వుండగా, యీయనకోరినది రాజమహేంద్రవరం సర్కారుకింద స్తళములు యిరువైవక్కటింటికి మెట్టు స్తళకరిణీకము దయచేయించ వలశినది అని ప్రార్థించుకున్నందున ఆలాగునానె గజపతి దేవుమహారాజులుంగారు దయచేసి నిశ్శంకులనాయనింగారికి శ్రీమదనంతకోటి సూర్యప్రకాశ శంఖచక్ర దేదీప్యమాన శ్రీమత్పురుషోత్తమ వీరప్రసాద కటకి శింహాసనరాజ్యాధి గజపతి సముఖ నిశంఖమహాశంఖరనిశ్శంక సింహాసమాన సకలవిద్వజ్జన ప్రముఖ సంస్తితి శ్రీమహాంమ్మేరు సార్వభౌమ మహాంతి పండిత సన్నుత నిశ్శంకనాయనిమహాపాత్రుడు అనేకితాబు యిచ్చి రాజమహేంద్రపు స్తలాలు.

| | | | |
|---|---|---|---|
| ౧ పోల్నాటి | స్తళము | ౧ వాగల్నాడు | స్తళం |
| ౧ బోడసకుర్రు | ,, | ౧ మొల్లేరు | ,, |
| ౧ పోన్నాడ | ,, | ౧ రాజపూడి | ,, |
| ౧ నందపూడి కోట్కాం | ,, | ౧ సర్వశిద్ధి | ,, |
| ౧ కిముమ్మారు స్తళం | ,, | ౧ రాయవరం | ,, |
| ౧ బిక్కవోలు స్తళం | ,, | ౧ కాకినాడ | ,, |
| ౧ యీతకోట | ,, | ౧ శలపాక | ,, |
| ౧ కోరుకొండ | ,, | ౧ తాటిపాక | ,, |
| ౧ అరట్లకట్ల | ,, | ౧ కోట స్తళము. | ,, |
| ౧ చోడవరం | ,, | —— | |
| ౧ వింజరం | ,, | ౨౧ | |
| ౧ మురుమళ్ల | ,, | | |

యీస్థలాల య్యొక్కస్థలకిరణీకం పుత్రపౌత్రపారంపర్యం అనుభవించుకుంటూవుండమని శాశ్వితపూర్వమయిన దానపత్రములు వ్రాయించి దయచేసి ఆయనకు వెండికలందాను అందలము దయచేశినారు. ఈయిరువైవక్కస్థళాలకున్నూ నూటికి వరహాలుసుమున్ను పుట్టికి తూమెడు నేలమాన్యమున్ను యీప్రకారముగా అనుభవిస్తూ యీ స్తళాలకు అధికారము చేస్తూ [illegible] కారి సమస్తమునందు లెఖ్ఖవ్రాస్తూ రాజరాజ మహారాజరాజేశ్వర శ్రీవిరనపతేశ్వర గజపతి [illegible]శ్వరసముకోటి కర్ణాటక కలబరిగేశ్వర శ్రీమహారాజులుంగారు యీశ్వరప్రీతిగా బ్రాహ్మణులకు దయచేసినదేమి పూర్వపురాజులు దయచేశినదేమి అగ్రహారాలు భట్లు భిందలు-

ఖండ్రికలు కాపాడుతు యజనయాజన అధ్యయనాధ్యాపక దానప్రతిగ్రహ షట్కర్మనిరతులయిన విద్వన్మహాజనులయొక్క యజ్ఞయాగాదులు విధ్యుక్త ప్రకారముగా సంరక్షణచేసుకుంటూ సుఖానవుండుకొమ్మని శాశ్వితపూర్వకమయిన దానపత్రికలు వ్రాయించి దయచేశినారు. యీనిశ్శంకనాయుని మహాపాత్రుడితమ్ముడు అప్పలయ్యమహాపాత్రుడు నిశ్శంకనాయుని మహాపాత్రుని తరువాతను రాజమహేంద్రవర దండపాటియేకేంద్ర యేకేంద్రాస్థల కరిణీకముల ఆయమూలము కిమ్మూరుస్థళము చోడవరముస్థళం మొదలుగాగల శీమామూలము యేకవింశతిస్థళముల కరిణీకము అనుభవిస్తూవుండి యీతను-నండూరితిమ్మరాజును తోలేటి వీరమరాజును వాడ్రేవు మారుకొండరాజును యీముగ్గురిని గుమాస్తాలుగా వుంచుకుని, లెఖ్కపత్రములు వ్రాయిస్తూవుండేవాడు కొన్నిదినములు జరిగిన తరువాత యీముగ్గురిలోను పెద్దయారిదా అనగాగుమాస్తాఅయిన నండూరి తిమ్మరాజుకు-మహాపాత్రుడు అనెపద్దుయిచ్చి, అందలముయిచ్చి గొప్పచేశినాడు. యీచొప్పునజరుగుతూవుండగా-తూర్పునకాటంపల్లివారు అనేనియ్యోగులు-వారికొడలు తనపెనిమిటి పోయిన తరువాత కుమారుణ్ని వెంటబెట్టుకుని రాజమహేంద్రవరముతల్లిగారియింటికి వచ్చివుండి ఆపడుచు తనకుమారుణ్ని నిశ్శంకులవారి యింట్కి వెంట బెట్టుకొని వచ్చి, మీచిన్నవాండ్లతోకూడా మాచిన్నవాడికి చదువుచెప్పించమని చెప్పకుంటే అలాగునె చెప్పించిరి. ఆచిన్నవాడు తెనుగు- అరెం-నాగరం- ఫారషీ మొదలయినవిద్యలు శీఘ్రకాలములోనె అభ్యశించి రాజమహేంద్రవరంనిఘామాని చేస్తూవున్నటువంటి శిరిశ్చంద్రుడిదగ్గిరికి వచ్చి కనిపెట్టుకుని వుంటూవుండెవాడు. ఏకనాటకాలమందు గజపతివారివద్దినుంచి శిరిశ్చంద్రుడివద్దికి నాగరముతో జాబులు వచ్చెను. ఆసమయములో కాటంపల్లివీరయ్య అనెచిన్నవాడు ప్రభువుయొక్కసాన్నిధ్యమందువుండి ఆవుత్తరాలు తానుచదివి ప్రభువుఅభిమతంచొప్పున మారుజాబులు వ్రాసినాడు; గనుక ఆచిన్నవాణ్ని శిరిశ్చంద్రుడు చాలామెచ్చుకుని అప్పుడు కాటంపల్లి వీరయ్యకు పద్దెనిమిది ముజాపతుల స్థళకరిణీకానకు నాలుగోసంప్రతియిచ్చి పట్నాయకం యిచ్చి-వీరపతాణేని అన్నపద్దుయిచ్చినారు. గనుక నిశ్శంకులవారికి స్వాధీనులుగాకుండానండూరివారు- తోలేటివారు- వాడ్రేవువారు- వీరపతాణేవారు - నాలుగుసంప్రతులవారు ప్రబలి, నిశ్శంకులవారిని అణిచివేశి తాముమిరాశీకి దఖలుదార్లుఅయి నిఘామాముల దగ్గిరపానుకుని వుండిరి.

రాజమహేంద్రపు సర్కారులోనైన బిక్కవోలు పరగణాలో మయి వెల్లపాలెపు కాపరస్తుడయిన అవసరాల పెద్దిరాజుఅనేఆయన వొక ఆరువేలని యోగ్యాగి కలడు. వారియింటివద్ద శీతడనేవాడు వక శూద్రదానికొడుకు పెద్దిరాజుగారి యింటివద్ద దూడలుకాస్తూవుండేవాడు. ఆపెద్దిరాజుఅనే ఆయన వుదయకాలమందు ఆశీతడనేవాడికి చద్ది అన్నముపెట్టించి దూడలతోకూడా వాణ్ని పొలములోనికి పంపించి మాధ్యాహ్నికంవేళ తాను భోజనంచేశినపిమ్మట తాను యింతఅన్నం పట్టుకొనిపొలములోకివెళ్లి అన్నము వాడికిపెట్టి వస్తూవుండేవాడు. యీలాగున కొన్ని దినములు జరిగినతరువాత వకనాడు యప్పటివలెనే శీతడికి చద్దిఅన్నము పెట్టించి దూడలతోకూడా పొలంలోకి పంపించి మాధ్యాహ్నికంవేళ శీతడినిమిత్తమై పెద్దిరాజు అన్నము పట్టుకునివేళ్లేవేళకు పశువులు పొలములో మేస్తూవుండగా శీతడు అనేవాడు వక తాడిచెట్టునీడను పరున్నాడు. ప్రొద్దు అతిక్రమించినకొద్ది శీతడిముఖానికి యండతగులుతూవున్నందుచాత బహువృత్తమైన వకఘటసర్పమువచ్చి శీతడిముఖానకు యండతగలకుండా ఫణం సూర్యకిరణాలకు అడ్డంపట్టివున్న సమయములో పెద్దిరాజు వెళ్లిచూచి చాలా హాశ్చర్యపడి వీడుగొప్ప అదృష్టవంతుడు అవుతాడు అని నిశ్చయించి దూరముగావుండి చడిచేశినంతట సర్పము, లేచిపోయినది. తరువాత శీతణ్ని లేపి వాడికి అన్నముపెట్టినాడు. భోజనము చేసిన తరువాత దగ్గిరకూర్చుండి, అవురా శీతా నీకుఅదృష్టమువస్తే నాకు యేమియిస్తావు అని అడిగినాడు. అందుకు వాడుచెప్పినమాట: నాకు అంతఅదృష్టమువచ్చే వేళకు నాకు యే అధికారము వస్తున్నదో ఆ అధికారంనాదిఅని అనిపించి కలిగిన అయిశ్వర్యము అంతా మీరె అనుభవించమని చెప్పినాడట. ఆప్రకారం వాడిచాతప్రమాణంచేయించి నమస్కారం పుచ్చుకున్నాడు. ఆరోజుమొదలుకుని ఆశీతడనేవాడిచాత దూడలు కాయించడం మాని వాడికి విద్యచెప్పిస్తు యీప్రకారము వాణ్ని మోతాదుగా వుంచినాడు. వకనాడు శీతడు పెద్దిరాజువద్దికి వచ్చిబాబుశెలవుయిస్తె నౌకరికివెళ్లుతాను అనిఅడిగితే పదిరూపాయీలు ఖర్చుకుయిచ్చిపంపించినంతట వాడువెళ్లి వోరుంగల్లుప్రవేశించి అంతకంతకు పదియిరువైమందితో సరదారీచేశి యెక్కడెక్కడకార్యములలో వొరవగా పనిచేస్తూవచ్చినాడు. గనుక ప్రభువుకు నిండా అనుగ్రహము వచ్చి మూడునాలుగువేలకు సరీదారీ యిచ్చి దానికి తగినజాగీరుయిచ్చివుంచిరి. యీప్రకారము కొన్ని దినములు జరిగినతరువాత తురకారణ్యాం వచ్చి వోరుంగల్లు ఆక్రమించుకునిరిగనుక శితాఫిఖానుడనే కితాబుకలిగినశీతడు-వోరుంగల్లు విడిచి కటకం ప్రవేశించెను. గజపతి ముకుందదేవువారు శితాఫి

ఖానుడికి అతనివెంట వచ్చిన ఫౌంజుతో కూడా కొల్వునిల్పిరి. రాజమహేంద్రవరం నిఘామానీచేస్తూవున్న శిరిశ్చంద్రుణ్ని గజపతివారు కటకానికి పిలిపించి రాజమహేంద్రవరం సఘామాని శితాఫిఖానుడికి కాయంచేసి నాలుగు అయిదువేల ఫౌంజుకూడాయిచ్చి రాజమహేంద్రవరము పంపించగా అతనువచ్చి రాజమహేంద్రవరము ప్రవేశించి అదివరకు చాళుక్యవంశపురాజుల అధికారం వేంగీదేశానకు అంతరమైననాటినుంచి గడిదుర్గమై వున్న రామగిరిదుర్గము విడిచిపెట్టి దానికి వుత్తరభాగమందు రెండుక్రోసులదూరమున రాజమహేంద్రవరంపట్నానకు వుత్తరంవైపున వున్న నేలకోటలో ప్రవేశించి ఖిల్లె॥ రాజమహేంద్రిదే కసుబె ద్రాక్షవరంమహాళ్ళకు హుద్దాదారుడై అవసరాలపెద్దిరాజును పిలుపించి బరాయకుద్దీ దివానుగిరి పెద్దిరాజుకు యిచ్చెను. యీచొప్పున నిఘామాని చేస్తూవుండి కొన్ని దినములు జరిగినతరువాత అవసరాల పెద్దిరాజుకు రాజమహేంద్రంక్రింది మహాల్లాతులు గనుక స్తానాపతికరిణీకం పెద్దిరాజుకుయిచ్చెను. తరువాత శితాఫిఖానుడిక నాగమ్మఅని వకకుమార్తెకలిగినది. ఆచిన్నది పద్ధాలుగు సంవత్సరములదై యవ్వనప్రాప్తురాలై వుండెను. పెద్దిరాజు మిక్కిలి సన్మానంగా అంతఃపురాల్లోకివస్తూపోతూ వున్నందుచాత అతను మిక్కిలి సౌందర్యవిగ్రహం అవుటచూచి అతనియందు నాగమ్మ అనేచిన్నది వాంఛపడి తనవద్దికిరమ్మని వర్తమానము పంపిస్తే పెద్దిరాజువిని యెక్కడనయినా కలదా! శితాఫిఖానుడు నీకు కన్నతండ్రిన్ని నాకు పోషిస్తూవున్న తండ్రిన్ని. అదిగనుక నీవు నాతోడ బుట్టినపడుచువంటి దానవు. యీలాగంటితలపు నీవు తలచరాదని పరిహరించెను. అందుమీద ఆచిన్నదానికి పెద్దిరాజుతోటి చాలాకోపం వచ్చి మరిపదిరోజులు నెలరోజులు జరిగినతరువాతను పెద్దిరాజు తనను రమ్మన్నట్టుగా తండ్రితో చెప్పినది. అందుమీద పెద్దిరాజుమీద చాలాకోపమువచ్చి శితాఫిఖానుడు కచేరీలోకి వచ్చి కూర్చుండి అతన్ని పిలుపించి పెద్దిరాజుగారు మాతృద్రోహానకు శిక్షయేమి? అని అడిగితే యిందుగో యీశిక్ష చాయవలసినది అని తనరెండునేత్రములు తీసివేసి పాలకిలో కూర్చుండి యింటికివచ్చి ఆమరునాడె ప్రయాణమై పాలకిసవారి చేసుకుని గోలకొండకు ఫితువాకువెళ్లి అక్కడ నవాబు యిభరాంపాదుషహాగారి దగ్గిర సన్మాని సరదారుడై వున్న జూపల్లె సామంతరావును పొడగని గజపతిరాజ్యం యీవత్తు పాదుషహాగారు సాధించేటందుకు యిప్పుడు సమయము అని గజపతి ఆయం యీవత్తు చెప్పెను. అంతట సామంతరావు యిభరాం పాదుషహా

వారితోటి ఈసంగతి మాలుంచేసి పెద్దిరాజును వెంటబెట్టుకుని వెళ్లి పాదుషహా గారి దరిశనము చేయించినంతట యిభరాం పాదుషహాగారు పెద్దిరాజును చూచి రాజమహేంద్రవరపు దుర్గం మాకు తాణాచేయించగలవా అని అడిగితే, పెద్దిరాజు ఖూర్నిషాల్ చేసి, హుకుం పరవమాయించి తగిన కుమ్మక్కు దయచేయిస్తే రాజమహేంద్రవరపుదుర్గము సాధించి దుర్గములో హుజరతువారి తాణా కాయముచేసిన ఝామువేళకు హుజూరిలోకి బకీసు అందేలాగు చేయిస్తున్నానని యిలతిమేసు చేసినాడు. అందుకు ఖాముంను చాలా తాజబుఅయి పెద్దిరాజును చాలా దయచేసి అక్కడవుంచి తనహుజూరు మజుముదార్లున్ను అంతో తిమ్మరుస్న తరవునుంచి జావాస్నాదులకు పంపించి గజపతివారి దేశము హాకీకతులు తెప్పించి యిభరాం పాదుషహాగారు మలికినెబు రఘాతుఖాన్ శిపెః సాలాల్ శింగారించి ఫిరంగి అరబా నౌబత్ సరంజామము యిచ్చి వడిశా రాజ్యము సాధించేటందుకు పెద్దిరాజుగారి వెంబడిన యిచ్చిన సరదార్లున్ను

| | |
|---|---|
| ౮ తురకలు. | ౧ కతారి వీరమరావు |
| ౧ సయ్యదు బడేఖాన్ హవాల్దారు | ౧ ముత్యాల యల్లప్పాళ్వారావు |
| సవారాన | ౧ శెట్టిపల్లి భల్లెరావు |
| ౧ సలాబతుఖాన్ హవాలుదారు తోపు | ౧ మొదర్లుమెట్ట గోపాలనేను |
| ౧ సయ్యదుమీయా [ఖానె | ౧ భల్లసు చిన్నారావు |
| ౧ షహామహమ్మదుఖాన్ వజీరు | ౧ వెల్లంకి రామారావు |
| ౭ తెలగసరదార్లు. | — |
| ౧ జూపల్లి సామంతరావు | ౧౧ |

ఈ మొదలయిన సరదార్లతో పదకొండువేల గుర్రములున్ను యెనభైవేల కాలుబలమున్ను హుకుముప్రకారము వచ్చి నార్కిడపల్లివద్దను గోదు దాటి యీతకోట సాధించి తాతపూడిరేవు దాటి నల్లూరిమడుగు ధరిని దిగివుండగా నల్లూరి చౌదరి గంధం తిమ్మయమహాపాత్రుడు జరిగినంత లష్కరు సరంజాముచేశెను. మరునాడు కొంతగుర్రమున్ను కొంత ఫౌంజున్ను కసుబా ద్రాక్షారామము ముట్టడివేసి వుండగా నల్లూరి గంధం తిమ్మయమహాపాత్రుడు తురకలధాటి వచ్చెనని రాజమహేంద్రవరం శితాబుఖానుడికి జాబులువ్రాసి సూన్నేని కొండను అనెవాడి చాత పంపించగా ఆజాబులు ద్రాక్షారాముముట్టడిలో తురకలు పట్టుకొని షహామహమ్మదుఖాన్ వజీరుగారికి అగపరచగా ఆజాబులు ఆయన చూచి గంధం తిమ్మయ్యమహాపాత్రుణ్ణి పట్టితెప్పించి వోరి యీలాగంటివి చితాలీకులు పన్ని వ్రాయవచ్చునా

ఖానుడికి అతనివేంట వచ్చిన ఫౌంజుతో కూడా కొల్వునిల్పిరి. రాజమహేంద్రవరం నిఘామూనీచేస్తూవున్న శిరిశ్చంద్రుణ్ని గజపతివారు కటకానికి పిలిపించి రాజమహేంద్రవరం నిఘామాని శితాఫిఖానుడికి ఖాయంచేసి నాలుగు అయిదువేల ఫౌంజుకూడాయిచ్చి రాజమహేంద్రవరము పంపించగా అతనువచ్చి రాజమహేంద్రవరము ప్రవేశించి అదివరకు చాళుక్యవంశపురాజుల అధికారం వేంగీదేశానకు అంతరమైననాటినుంచి గడిదుర్గమై వున్న యోమగిరిదుర్గము విడిచి పెట్టి దానికి వుత్తరభాగమందు రెండుక్రోసులదూరమున రాజమహేంద్రవరంపట్నానకు వుత్తరంవైపున వున్న నేలకోటలో ప్రవేశించి ఖిల్లె॥ రాజమహేంద్రిదే కసుబె ద్రాక్షవరంమహాళ్ళకు హుద్దాదారుడై అవసరాలపెద్దిరాజును పిలుపించి బరాయకుద్దీ దివానగిరి పెద్దిరాజుకు యిచ్చెను. యీచొప్పున నిఘామాని చేస్తూవుండి కొన్నిదినములు జరిగినతరువాత అవసరాల పెద్దిరాజుకు రాజమహేంద్రంక్రింది మహాల్లాతులు ౧౮కి స్తానాపతికరిణీకం పెద్దిరాజుకుయిచ్చెను. తరువాత శితాఫిఖానుడికి నాగమ్మఅని వకకుమార్తెకలిగినది. ఆచిన్నది పద్ధాలుగు సంవత్సరములదై యవ్వనప్రాప్తురాలై వుండెను. పెద్దిరాజు మిక్కిలి సన్మానంగా అంతఃపురాల్లోకివస్తూపోతూ వున్నందుచాత అతను మిక్కిలి సౌందర్యవిగ్రహం అవుటచూచి అతనియందు నాగమ్మ అనేచిన్నది వాంఛపడి తనవద్దికిరమ్మని వర్తమానము పంపిస్తే పెద్దిరాజువిని యెక్కడనయినా కలదా! శితాఫిఖానుడు నీకు కన్నతండ్రిన్ని నాకు పోషిస్తూవున్న తండ్రిన్ని. అదిగనుక నీవు నాతోడ బుట్టినపడుచువంటి దానవు. యీలాగంటితలపు నీవు తలచరాదని పరిహరించెను. అందుమీాద ఆచిన్నదానికి పెద్దిరాజుతో చాలాకోపం వచ్చి మరిపదిరోజులు నెలరోజులు జరిగినతరువాతను పెద్దిరాజు తనను రమ్మన్నట్టుగా తండ్రితో చెప్పినది. అందుమీాద పెద్దిరాజుమీాద చాలాకోపమువచ్చి శితాఫిఖానుడు కచేరీలోకి వచ్చి కూర్చుండి అతన్ని పిలుపించి పెద్దిరాజుగారు మాతృద్రోహానకు శిక్షయేమి? అని అడిగితే ... గో యీశిక్ష చాయవలసినది అని తనరెండునేత్రములు తీసివేశి • పాలకిలో కూర్చుండి యింటికివచ్చి ఆమరునాడె ప్రయాణమై పాలకిసవారి చేసుకుని గోలకొండకు ఫితువాకువెళ్లి అక్కడ నవాబు యిభరాంపాదుషహాగారి దగ్గిర సన్మాని సరదారుడై వున్న జూపల్లె సామంతరావును పొడగని గజపతి రాజ్యం యావత్తు పాదుషహాగారు సాధించేటందుకు యిప్పుడు సమయము అని గజపతి ఆయం యావత్తు చెప్పెను. అంతట సామంతరావు యిభరాం పాదుషహా

వారితోటి ఈసంగతి మాలుంచేసి పెద్దిరాజును వెంటబెట్టుకుని వెళ్లి పాదుషహా గారి దరిశనము చేయించినంతట యిభరాం పాదుషహాగారు పెద్దిరాజును చూచి రాజమహేంద్రవరపు దుర్గం మాకు తాణాచేయించగలవా అని అడిగితే, పెద్దిరాజు ఖూర్నిషాల్ చేస్కి, హుకుం పరమాయించి లేగిన కుమ్మక్కు దయచేయిస్తే రాజమహేంద్రవరపుదుర్గము సాధించి దుర్గములో హాజరతువారి తాణా కాయముచేసిన ఝూము వేళకు హుజూరిలోకి బకీసు అందేలాగు చేయిస్తున్నానని యిలతిమేసు చేసినాడు. అందుకు ఖామంను చాలా తాజబుఅయి పెద్దిరాజును చాలా దయచేసి అక్కడవుంచి తనహుజూరు మజుముదాల్లు అంతో తిమ్మర్సు తరవునుంచి జావాన్సాదులకు పంపించి గజపతివారి దేశము హాకీకతులు తెప్పించి యిభరాం పాదుషహాగారు మలికినెబు రిఫాతుఖాన్ శిపెహ సాలాల్ శింగారించి ఫిరంగి అరబా నౌబత్ సరంజామము యిచ్చి వడీశా రాజ్యము సాధించేటందుకు పెద్దిరాజుగారి వెంబడిన యిచ్చిన సరదాల్లు

| | |
|---|---|
| ౮ తురకలు. | ౧ కతారి వీరమరావు |
| ౧ సయ్యదు బడేఖాన్ హవాల్దారు సవారాన | ౧ ముత్యాల యల్లప్పాళ్వారావు |
| | ౧ శెట్టిపల్లి భల్లెరావు |
| ౧ సలాబతుఖాన్ హవాలుదారు తోవు | ౧ మెదల్లమెట్ట గోపాలనేను |
| ౧ సయ్యదుమీరా ఖానె | ౧ భల్లను చిన్నారావు |
| ౧ షహామహమ్మదుఖాన్ వజీరు | ౧ వెల్లంకి రామారావు |
| ౭ తెలగసరదార్లు. | — |
| ౧ జూపల్లె సామంతరావు | ౧౧ |

ఈ మొదలయిన సరదార్లతో పదకొండువేల గుర్రములున్ను యెనభైవేల కాలుబలమున్ను హుకుముప్రకారము వచ్చి నార్కిడపల్లివద్దను గెసును దాటి యీతకోట సాధించి తాతపూడిరేవు దాటి నల్లూరిమడుగు ధరిని దిగివుండగా నల్లూరి చౌదరి గంధం తిమ్మయమహాపాత్రుడు జరిగినంత లష్కరు సరంజాముచేశెను. మరునాడు కొంతగుర్రములున్ను కొంత ఫౌంజున్ను కసుబా ద్రాక్షారామ ముట్టడివేసివుండగా నల్లూరి గంధం తిమ్మయమహాపాత్రుడు తురకలధాటి వచ్చెనని రాజమహేంద్రవరం శితాసిఖానుడికి జాబులువ్రాసి సూన్నేని కొండను అనెవాడి చాన పంపించగా ఆజాబులు ద్రాక్షారామముట్టడిలో తురకలు పట్టుకని షహామహమ్మదుఖాన్ వజీరుగారికి అగపరచగా ఆజాబులు ఆయన చూచి గంధం తిమ్మయ్యమహాపాత్రుణ్ణి పట్టితెప్పించి వోరి యీలాగంటె చితాలీకులు పన్ని వ్రాయవచ్చునా

అని ద్రాక్షారాములో దక్షగుండము చెరువు తూర్పుగట్టుమీదను నల్లూరిచాదరి అయిన గంధంతిమ్మయ్య మహాపాత్రుణ్ని కొట్టించినారు.

అంతట మల్కిబేబుగారు యెల్లోపంతులు వడియలు సర్ఫరుషాహిగాని కొంతగుర్రము కాల్బలం తయారాతి చేసి రాజమహేంద్ర దుర్గంమీదను మొనపెట్టి ధవళేశ్వరం దగ్గిర యోమగిరిదుర్గము తాణాచేసి శాలివాహనశక వర్షములు ౧౪౮౫ అంగీరస సంవత్సర ఆషాఢ శుద్ధ ౫ గురువారంనాడు శితాఫి ఖానుణ్ని ఫారకా చేసి రాజమహేంద్రవరంకోట తురకాణ్యం తాణాచేసిరి. అవసరాల పెద్దిరాజు గోలకొండనుంచి వచ్చేటప్పుడు గోలకొండ మొదలుకొని రాజమ...ం ద్రవరము పర్యంతమున్న రెండేసి క్రోసులదూరాన వకభేరిచొప్పున అంచలు వుం చి నాడట. ఆభేరిశబ్దములయొక్క అంచలమీద అతను రాజమహేంద్రవరంకోట తాణాచేసిన ఘూము వేళకు గోలకొండకు బకీరు చేయించినాడు.

శితాఫిఖానుడు రాజమహేంద్రవరం నుంచి పరారి అయిపోతే తురకఫౌం జు వెంటతరిమినది. యెక్కడికి అందక తోటపల్లి అనే మన్యములో వుండగా అక్కడికి తురకఫౌంజులు దావుచోలు వెళ్లి శితాఫిఖానుణ్ని పట్టుకుని తల కొట్టి వేసినారు. అప్పుడు కవీశ్వర్లు చెప్పిన పద్యము :

సీ. లలితంపు గౌతమి లవణవారిధిగాగ, నాయోమగిరి సువేలాద్రిగాగ
మహుడు పెద్దనమంత్రి మహివిభీషణుగాగ, మల్కిబేయబు హనుమంతుగాగ
బాహుబలేంద్రుండు భల్లూకపతిగాగ, కరుకుతుర్కలు ప్లవంగములుగాగ
రాజమహేంద్రమే లంకాపురముగాగ రమణతో యిభరాము రాముగాగ
కనలి యహితుని శితాఫిఖాను వెడల, దోలియాంగీరనందు నుద్ధురత జూపి
సరవి నాషాఢశుద్ధపంచమి మొదలుగ, రాజ్యమేలెను యిభ రామురామశౌరి.

మల్కిబేయబుగారు రాజమహేంద్రవరము సాధించి వుండ్ర కళింగజయ స్తంభాలువేసి చిలుకహద్దుచేసుకొని కళింగదేశము కూడా యేలుతూవుండెను. అది మొదలుకొని మాములె రాజమహేంద్రవరపు స్థలకరణాలు అయ్యా పతాశేని మా కోంద్రాజు-తోలేటిమార్కోండ్రాజు-నందూరికృష్ణమరాజు వాద్రేవుఅయ్యాపరాజ ఈనల్గురు గోలకొండకువెళ్లి పాదుషా దర్శనముచేసి- వడిశా రాజ్యపులెఖ్ఖలు యావత్తుఅగపరచి మేమురాజమహేంద్రవరపు స్థలకరణాలము అని చెప్పుకుని గు పతి వారినాటిపట్టాలు అగపర్చుకుని మామిరాశీఖాయము చేయించుమని చెప్పుక

న్నందున ఆప్రకారమే భూమంతు చిత్తానకు తెచ్చి వీరిమిరాశీరకాయలు కోనప్పాషహ బదస్తూరు మామూలు జారిపుంచుమని మల్కినేబులమ్మరుగలిపించినారు. దుర్ముఖసం నుయి స్తే బమోజబు ఫరమాస్ మామూలే రాజమహేంద్రి దండతరువాత జిబిలిగె నర మిరాశీసుదామధు ప్రకారం బజ్జినస్సు నాల్గు సంప్రతుల వారికిమును. ౧ ౨౮౦ అప్పుడు రాజమహేంద్రవరపు దండపాట స్తల కరణాలు అయిన అయ్యమహేంద్రి మార్కొండ్రాజు - తోలేటి మార్కొండ్రాజు - నందూరి కృష్ణమరాజు ఏలుబడి ద్రేవు అయ్యపరాజు - యీనల్గురు యేకస్తులయి - మనమిరాశీలు దివాణంనడ్ పించిరి గదా నమష్టినిపుంటె ముందర పోట్లాట వస్తుంది గనుక నాల్గు సంప్రతులకు మిరాశీ పంచుకుందామని రాజమహేంద్రవరపు పిన్న పెద్దలు

౧ పిఠాపురం దుర్యోధను గద్దా పాత్రుడు
౧ ద్రాక్షారామ పాపలింగాపాత్రుడు
౧ కోట స్తళం నరుకుల రాజపాత్రుడు
౧ యీతకోట అక్కిరెడ్డి లింగారెడ్డి
౧ తాటిపాక వలము లక్ష్మయ్య
౧ బోడసకుర్రు కర్నె మార్కొండా పాత్రుడు
౧ కాకినాడ సబ్బినేని గుండాపాత్రుడు
౧ రాజమహేంద్రవరం కసుబా హవేలీ పాలక భగవానిపాత్రుడు
౧ గొడిదాసరి శలపాక అర్జునపాత్రుడు
౧ చిక్కవోలు రాద్ర బద్రిరాజు

ఈ మొదలయిన పెద్దమనుష్యుల పరంగా రాజమహేంద్రవరపు దండపాట యేకేంద్ర స్తళకరిణీకమున్నూ హవేలీ స్తళకరిణీకమున్నూ అగ్రహారాల స్తళకరిణీకమున్నూ సుహల్లాతులు నాలుగు సంప్రతులవారు నాలుగుభాగాలను పంచుకున్న వివరం.

| | |
|---|---|
| ౧ పోల్నాటి స్తళం | వాద్రేవు అయ్యపరాజు |
| ౧ బోడ్సకుర్రు స్తళం | ౧ కోట స్తళం |
| ౧ పొన్నాడ స్తళం | ౧ చాగల్నాడు స్తళం |
| ౧ నందిపూడి కోతాము స్తళం | ౧ మొల్లేరు రాజపూడి |
| ౦౪౦ కిమ్మూరు స్తళం | ౧ సర్వసిద్ధిదాయవర స్తలము |
| ౮౪౦ వెరశి | ౦౪౦ తాటిపాక స్తలము |
| | —— |
| | ౮౪౦ |

| | |
|---|---|
| అని ద్రాక్షారాములో గజు | నండూరి కృష్ణంరాజు |
| అయిన గంధంతిమ్మన్నగు | ౧ చోడవరము స్థళము |
| ౨ | ౨ వింజరం మురుమాళ్ల స్థళం |
| అంతట్ల స్థళం | ౧ కాకినాడ శలపాక స్థళము |
| కొంతగుల్లకట్ట స్థళం | ౦౪౦ కిమ్మూరు స్థళం |
| ధన | ౦౪౦ తాటిపాక స్థళము |
| | ౫ |

ఈప్రకారము పంచుకుని వకరికి వకరు సమాఖ్య సనదులు వ్రాసుకున్నారు.

రాజమహేంద్రవరపు సర్కారు మల్కినేబుసల్కమ్మారుగారు బందుబస్తు చేశిన తరువాత సర్కారు మజ్కూరులో ఆమల్లు చేశ్ని న వారి వివరము.

౧ యల్లోముత్తు తరఫుదారు రాజమహేంద్రిగారు మజ్ముదారు అంతో తిమ్మర్సు యు.శ్రీముఖసంవత్సరం తాగాయతి ప్రమాది సంవత్సరం పరియంతంనిఘా వాని సంవత్సరాలు౬. ౨ అటుతరువాత యల్లప్ప అశ్వారావు మొఖాసాకు ద్రాక్షారామనిఘాతరఫునిఘావాను కోటగిరి కొండమనేను యేన్మమహల్లు బేరీజుగాను ఖిల్లే రాజమహేంద్రి హవేలీఖిలుగాను మహాల్లకు తరఫు దారుకు వుగతుల అచ్చుతరాయగారు మజ్ముదారు, అంతో తిమ్మర్సు; యేలుబడి అశ్వారావు దే॥ వికృతిసంవత్సరం పరియాంత్తం సంవత్సరాలు౧౧. ౩ అంతట జూపల్లె ధర్మారావు మొఖాసాకు ద్రాక్షారామనిఘాతరఫు కోనేటివగధరుడు అతడు చనిపోయిన తరువాత ఆచార్యపంతులు నిఘావాను ప్లవంగసంవత్సరం పరియంత్తం సంవత్సరాలు౧౨. ౪ అటుతరువాత హవేలీ రాజమహేంద్రి తరఫుదారు బింగూరి మల్లప్పమజుమువారు పీలుఖానా కోనప్ప యేలుబడి పింగళ సంవత్సరం పరియంతముస్నా సంవత్సరాలు౧౦. ౫ తిరుగా అచ్చుతరాయ తరఫుదారు మజుముదారుపీలుకానాకోనప్పయెలుబడి క్షయసంవత్సరపరియాంతముస్ను సంవత్సరాలు౯. ౬ శిరీభుమల్కి తరఫుదారు కొండపల్లియేలూరు రాజమహేంద్రి ఋందులనిఘావాను రాజమహేంద్రి గిడ్డరపు కోనప్ప పీలుఖానాకోనప్ప మజుముదారు ఋతినియారిదాలు బీరకాయల కోనప్ప చిక్కుడు కాయల కోనప్పా యేలుబడి విభవ సంవత్సరం పరియాంత్తం సంవత్సరాలు౨. ౭ యాలేమ్కమీరు ఋసుమాఈలు యేలుబడి శుక్లసంవత్సర పరియంత్తం సంవత్సరములు ౧. ౮ ఈతరువాత కాజెమహంకదు యేలుబడి ప్రమోదూత సంవత్సరం పరియాంత్తం సంవత్సరములు ౧. ౯ ఈతరువాత పాదుషాసులతాను ఖుసన ముల్కి; జూపల్లె ధర్మాజితరుపుదారు రాజమహేంద్రి మజుమువారు పీలుఖానాకోనప్ప యేలుబడి భావసంవత్సరం పరియంతముస్ను సంవత్సరాలు ౧౦. ౧ ఈతరువాత హుస్సేను

హగ్గారు తరుఫుదారు రాజమహేంద్రి మజుముదారు బీరకాయల కోనప్పామహా గారు హుశ్శేను కహాక త్తిగినిర్ణయము చేశి భూములు కొలిపించినారు. దుర్ముఖసంవత్సరం పరియంత్తం యేలుబడిసంవత్సరాలు ౨౨. ౧౧ఆతరుఘాత జబిలిగె నరసప్ప చిక్కుడుకాయల కోనప్ప యేలుబడి హేవళంబి సంవత్సరము౧. ౧౨అంతట మహంమ్మదు తరఫుదారు రాజమహేంద్రి కళింగ సల్కుమ్కస రాజమహేంద్రి మజుముదారు చిక్కుడుకాయల కోనప్ప వికారిసంవత్సర పరియంతము యేలుబడి సంవత్సరములు ౨. ౧౩ అంతట క॥ ద్రాక్షారామతరఫుదారు షేరుమహంమ్మదు ఖాన్ మొఖాసాఖల్లె రాజమహేంద్రి; మజుముదారు మొసలికంటి నారాయణప్ప గుండాల శింహాద్రివంతులు యేలుబడి సౌమ్యసంవత్సరము।పర్యంతమున్నా సంవత్సరాలు ౧౦. ౧౪ అంతట మహంమ్మదుబేగు తరఫుదారు; మజుముదారు అంగర కృష్ణారామర్సు జిల్లేళ్లకన్నప్ప యేలుబడి నలసంవత్సరం పరియంతము।సంవత్సరాలు ౭ రాజాతానీషా అబుల హస్సనుగార్లు ౧. ౧౫ అంగరకృష్ణోరామర్సుయేలుబడి ర్క్తాదిసంవత్సర పరియంతము సంవత్సరాలు ౪. ౧౬ హుశేనుబేగు రుధిరోద్గారి పరియంతమున్నా యేలుబడి సంవత్సరాలు ౩. ౧౭ పసునూరి వెంకటపతిక్రోధన సంవత్సర పరియంతమున్నా. యితడు సర్కారు కామీలుచేసి దివాణం దస్తరంలోను వ్రాయించినాడు; యేలుబడిసంవత్సరములు ౨. ౧౮ రాజాఅవరంగజహాక అగామోమీను నరసమతు శుక్ల సంవత్సర పరియంతము యేలుబడి సంవత్సరములు ౪. ౧౯ తిరిగి హుశేనుబేగు ఉ॥ అల్లీమదానుఖానుడు ప్రజోత్పత్తి సంవత్సరం పరియంతం సంవత్సరములు ౨. ౨౦ ముస్తుఫాకొల్లీఖానుడు ధాతసంవత్సర పరియంతమున్న యేలుబడి సంవత్సరములు ౫. ౨౧ రుస్తుందిలుఖానుడు యీశ్వరసంవత్సరం యేలుబడి౧. ౨౨పకీరుల్లాఖానుడు బహుధాన్యసంవత్సరపరియంతమున్నా సంవత్సరం ౧. ౨౩ మొహద్దిఖానుడు వృషసంవత్సరం పరియంతం యేలుబడి సంవత్సరములు ౭. ౨౪ రుస్తుందిలుఖానుడు రెండోమారు స్వభానుసంవత్సర పరియంతమున్న సంవత్సరములు ౨. ౨౫ మీరు కాయీం వ్యయసంవత్సర పరియంతమున్న యేలుబడిసంవత్సరాలు ౭. ౨౬ మీరు హస్సను సర్వజితుసంవత్సరం వరకు ౧. ౨౭ యీమధ్యను జీవమల్లు ఆరు నెలలు. ౨౮ మహంమ్మదుయూరు సర్వధారి పరియంతంసంవత్సరం ౧. ౨౯ అబీదుఖానుడు ఖరసంవత్సరంపరియంతము యేలుబడి సంవత్సరాలు ౭. ౩౦ జాబీదుబేగు ఖానుడు మన్మధసంవత్సరం పరియంతరం యేలుబడి సంవత్సరములు ౪. ౩౧ రాజాషహంమతుఖాను వుర్ఫు ముబారక్ ఖానుడు శుభకృతుసంవత్సరం పరియంతమున్న సంవత్సరములు ౧౭. ౩౨ సనావుల్లాఖానుడు ౧. ౩౩ అరబ్బేగు ఖానుడు రెండోమారు. రాజా నిజాముల్ ముల్కు ౧౧౭౭ ఫసలి ౩౪ మహంమదు సైదుఖానుడు విశ్వావసు సంవత్సర పరియత్తం యేలుబడి సంవ

త్సరములు ౨. 3౫ పైజుల్లా బేగు ఖానుడు ప్లవంగసంవత్సర పరియంత్తం యేలుబడి వత్సరాలు ౨. 3౬ రాజెబాదుల్లాఖాన్ సౌమ్య సంవత్సరపరియంత్తమున్న యేలుబడిసంవత్సరాలు ౨. 3౭ నయిదు లప్కరు ఖానుడు సాధారణ సంవత్సరపరియంతిమున్న యేలుబడి సంవత్సరాలు ౧. 3౮ హాజీహుశ్శేను ఉ॥ రుస్తుము అల్లిఖాన్ నలసంవత్సరం పరియంత్తం యేలుబడి సంవత్సరములు ౬. 3౯ అనవర్ధిఖానుడు రక్తాక్షి సంవత్సర పరియంత్తం యేలుబడి సంవత్సరములు ౪. 3౭ వుమ్మరు ఖల్లిఖానుడు క్షయ సంవత్సరపరియంతమున్న యేలుబడిసంవత్సరములు ౨. ౪౦ ఖాజీఖలీలు శుక్లసంవత్సర పరియంత్తమున్న సంవత్సరములు ౭. ౪౧ న్నేమతుల్లాఖానుడు ప్రజోత్పత్తి సంవత్సరపరి యంతమున్న యేలుబడి సంవత్సరములు ౨. ౪౨ జాపరల్లీ ఖానుడు ఆంగీరససంవత్సరం తాగాయతి శ్రీముఖ సంవత్సరం పరియంత్తంయేలుబడి సంవత్సరములు ౨. ౪3 శ్రీపూసపాటి విజయరామరాజు మహారాజులుంగారు భావ సంవత్సరం॥ యువ సంవత్సరం యేలుబడి ౪౪ ముసాభూశి ఫరాసులు యీశ్వర సంవత్సరపరియంతమున్న యేలుబడిసంవత్సరములు ౨. యీముసాభూశి ముసాకొప్పి మొదలయిన వారు పూసపాటి పెదవిజయరామరాజుగారితో కూడాబొబ్బిలిమీద లడాయికి వెళ్లిరి విజయరామరాజుగారిని అక్కడ బొబ్బిలిలో బొబ్బిలిరంగారావు భావమరది తాండ్రపాపయ్యగారు పొడిచివేశినతరువాత భూశి యకాయకిని గోలకొండకు లేచిపోయిన తరువాత బహుధాన్య సంవత్సరం దేశంలో తరఫిగా వున్నది. ౪౫ తరువాత పూసపాటి విజయరామరాజు అన్నకొమారుడు అనందగజపతి చిత్రభాను సంవత్సర పరియంతిము ప్రభుత్వం చేశి కళింగమన్యాలు అన్నీ సాధించి, అదిగాక రాజమహేంద్రము-బందరు పర్యంతము సాధించి, రాజమహేంద్రవరములో ప్రవేశించియుండి అక్కడ దేహంచాలించినారు యేండ్లు ౪. ౪౬ నవాబు బందగానె ఆలీ మీరునిజామల్లీ ఖాన్ బహదరు. ౪౭ నవాబు హాసనల్లీ ఖాన్ నాయబు సుల్తాను నవాబుఖాన్ తారణ సంవత్స పరియంతము సంవత్సరములు ౨. ౪౮ తరువాత సాహుకారు దామోదరదాసు వత్సవాయి రాఘవరాజు అనుమతిచాతను రాజమహేంద్రవరము యేలూరు సర్కారులు రెండున్నూ యిజారా చేశినాడు. రాజమహేంద్రవరముహావేలీ వగైరాకు బదిజమాలుఖాన్ అములు చేస్తూవుండేవాడు. పార్థివ సంవత్సరం వరకు జరిగినది. అంతట రాఘవరాజు పితూరిచాత పూసపాటి శీతారామరాజుగారి ఫౌంజువచ్చి బదిజమాలు ఖానుణ్ణి కొట్టవేశి రాజమహేంద్రము సర్కారు స్వాధీనము చేసుకొని వ్యయ సర్వజిత్తు రెండు సంవత్సరములు అములు చేసుకున్నారు. సంవత్సరములు ౨. అంతట దేశం కుంపిణివారి స్వాధీనము అయినది. జోగిపంతులు హాసనల్లీ ఖానుడు సర్కారు యిజారాచేసి అమలు బందు పస్తు చేసినాడు.

స్థానిక చరిత్రలనుండి

# ప్రాచీన రాజ్య పాలనము.

శ్లో. కేచి ద్దేశాధిపత్యం కతిచన శిబికాచామరచ్ఛత్రశోభాం,
కేచిద్రాజ్యం స్వకీయం కతిచన విధవై రగ్రహారా నుదారా
న్విందంతే లోకరక్షావిధిమహితమహాభాగధేయేఽన్నవేమ
క్షోణీపాలే సభాయాం సకలగుణనిధౌ రత్నసింహాసనస్థే.

ఈపైశ్లోకము అనవేమారెడ్డిగారి వానపల్లిశాసనములోనిది. ఇది శాలివాహనశకము ౧౩౦౦ల నాటిది. "సకలగుణములకునిధియైనటువంటియు, లోకరక్షణము నిమిత్తము గొప్పదైన తనమహాభాగధేయము నంతయు వినియోగించుచున్నటువంటియు అనవేమమహారాజులుంగారు కొలువుకూటములో రత్నసింహాసనమువీఁద కూర్చుండి ప్రజాపరిపాలనము చేయుచుండగా కొందఱు దేశాధిపత్యమును బడయుచుందురు; మఱికొందఱు పల్లకులు చామరములు ఛత్రములు - ఈ విధమగు గౌరవసమ్మానములను బడయుచుందురు; వేఱొకకొందఱు తాము గోల్పోయిన తమరాజ్యమును బడయుచుందురు; ఇంక కొందఱు భాగ్యవంతములైన యగ్రహారములను బడయుచుందురు" అనిపైశ్లోకముసకర్థము. ఈశ్లోకము అనవేమారెడ్డిగారి యాస్థానమున నిత్యము జరుగు కార్యక్రమమును దెలుపుచున్నది; అనగా శాలివాహన శకము ౧౩౦౦ ల ప్రాంతముల నాంధ్రదేశములోని సంస్థానములలో అదియే పరిపాటియైన దైనిక కార్యక్రమ మని నిశ్చయింపవచ్చును.

హిందూరాజ్యతంత్రము మనువునుండి మహమ్మదీయ పరిపాలనమువఱకు ఎచ్చటనో స్వల్పవిషయములలో దక్క, సాధారణముగ నన్నిముఖ్యవిషయములలోను ఒక్కరీతి నుండుటచేత హిందువులపరిపాలనమున గొంచె మించుమించుగ ప్రతిశతాబ్దిలోను రాజాస్థానముల నడచుచువచ్చిన కార్యక్రమ మదియేయని కూడ ననుదువచ్చును. అందువలన రెడ్డిరాజులు పరిపాలించుచుండినతఱి పరిపాలన మేరీతి నుండెనో పల్లవులనాడును, చాళుక్యులనాడును, చోళులనాడును తురుష్కు కర్ణాటాధీశుల కాలముననుగూడ అట్లే యుండెనని నిశ్చయింపవచ్చును. ఈప్రాచీనపరిపాలనములో ప్రధానముగ ప్రజలను శాసించువాడు రాజు; దేశమును పాలించువాడురాజు. రాజు రాజ్యపరిపాలనమును నడపుటకొఱకు దేశమును రాజకీయముగ ఇప్పుడు జిల్లా

లు తాలూకాలు జిల్లాలకువలెనే పూర్వకాలమున నాడులక్రిందను, స్థలములక్రిందను సీమలక్రిందను, ఇంక ననేకములైన విభాగములుగ చేయువారు. ఈవిధమైన రాజకీయ విభాగములు కాలక్రమమున రాజ్యతంత్రము విస్తరించినకొలదియు వచ్చినవే కాని మొట్టమొదటినుండియు వచ్చినవి కావు. మొట్టమొదట నేర్పడిన గొప్పరాజ్యవిభాగమున కుండినపేరు 'ఆహార' మని. క్రమముగా నాపేరు మారిపోయెను. మారిపోవుటతో ఆపేరబరగు రాజ్యవిభాగమున కుండు విస్తీర్ణతయు సంకుచిత మయ్యెను. పిదప నేర్పడిన రాజ్యవిభాగమునకు వచ్చిన పేరు 'విషయ' మని. విషయమునకే 'నాడు' అనియుపేరు. ఇవియే కాలక్రమమునస్థిర మైపోయెను. ఇది బ్రాహ్మణ్యమునకు పటుత్వమును, బలమును వచ్చిననాటికి స్థిరమైన పేరగుటచేత ఆయానాడులలో బ్రాహ్మణుల కాగా 'నాటి' వారని పేరుకలిగెను. ఎట్లన వేగినాటిలోనివారు వేగినాట్లు, వెలనాటిలోనివారు వెలనాట్లు. ఈవిధమున రాజకీయముగ నేర్పడిననాటివిభాగము బ్రాహ్మణులలో అంతశ్శాఖా ప్రాదుర్భావము నకు మూలకంద మయ్యెను. ఈ 'నాటి' విభాగమున 'స్థల' మను మఱియొకవిభాగము వచ్చెను. కాలము గడచినకొలది ఈ 'నాటి' విభాగము కొన్నికొన్నిపట్ల నంతరించియు, మఱికొన్నిపట్ల నుండియుగూడ సీమావిభాగమునకు తావొసంగెను. కర్ణాటరాజులకాలముననే సీమావిభాగము మొట్టమొదట ఏర్పడినట్లు తెలియవచ్చుచున్నది. సీమావిభాగములో 'నాటి' విభాగమ ప్రశస్త మయ్యెను. కొన్నికొన్ని మండలనాడులలో నే సీమావిభాగము వుండుటయుగలదు కాని పైనుడివినదే సాధారణ పద్ధతి. ఇవికాక చావడులు, వళితములు, కంపనములు - ఈవిధములైన విభాగములును ఏర్పడినవి. కాని యీరాజకీయవిభాగములకు ఇప్పటి ఫిర్కా తాలూకా జిల్లా యను రాజకీయవిభాగములకు నొకగొప్ప విభేదముకలదు: అదియేదనగా నిప్పటిరాజకీయవిభాగములు పరిపాలనా సౌకర్యములను మాత్రమే యాలోచించి చేయబడినవి. పూర్వపురాజకీయవిభాగము అట్లుకాక రాజ్యమునకు వచ్చువరుంబడి ననుసరించి యేర్పాటు చేయబడుచుండెడివి.

ఈవిధమున నొక్కొక్క విభాగమునకు నిర్ణీతమైన రాబడి యుండెడిది. అంతరాబడి వచ్చు నారాజ్యవిభాగముతోపాటు కొన్నిసంఖ్యలు కూడ పేర్కొనంబడుచుండెడివి. ఎట్లనగా వేంగినాడు పదహారువేలు, కొండపడమటినాడు డెబ్బది మూడు. కొండపల్లినాడు మూడువందలు. పాకనాడు ఇరువది యొక్కవేయి. కొన్నికొన్ని చోట్ల చిన్నచిన్న స్థల విభాగములకు నిట్టి సంఖ్యలు కలవు. (ఉదా: బెల్వోల ౧౨. శాసనములే కాక గ్రంథములును ఇటువంటి సంఖ్యలను

పొందుపఱిచి యుంచినవి. పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్ర మున సాధారణముగ సుప్రసిద్ధమైన భరతఖండ దేశములను పండితారాధ్య చరిత్ర మున నీక్రిందిరీతిని జెప్పియున్నాడు.

ఎంతెంత పరుస దా నేతెంచి చొచ్చు, నంతంత విస్తీర్ణమగు శివాలయము
లెంతెంత బరుస తా నేతెంచి కాంచు, నంతంత యున్నతంబగు లింగమూర్తి
లక్షింపగ సపాదలక్ష నేపాళ, మీక్షింపగ సపాద లక్ష సంజనిత (?)
లక్షింపగ సపాదలక్ష కేదార, మీక్షింపగ సపాద లక్ష దిర్వార్తి
లక్షింపగ సపాద లక్ష కాశ్మీర, మీక్షింపగ సపాద లక్ష కన్నోజ
లక్షింపగ సపాద లక్ష కొంకణము, వీక్షింప కరహాట్ట మిల సప్తలక్ష
క్రమమొంద సాళ్వాథగం బది లక్ష, పరిమితియా దశలక్ష బంగాళ భూమి
గూర్జి సప్తతి సహస్ర గుజరాష్ట్రభూమి, మఱి యాట దశలక్ష మాళవభూమి
జానొంద నివలి పంచద్రావిళముల, లో నవలక్ష తెలుంగు దీనికిని
ఇమ్మడి ముమ్మడి యితరదేశములు, నిమ్మహి దేశంబు లెన్నంగ నేల— పర్వతప్రకీర్ణము,

ఈసంఖ్య దేనిని తెలుపునో ప్రాచీన శాసనపరిశోధకులు చాలవఱకు చర్చించియున్నారు. ఒకటిరెండుకన్నడశాసనముల యాధారమున కొందఱు ఇది ఆరాజ్యవిభాగమునకు వచ్చునిష్కాదాయమును, మఱికొందఱిది ఆవిభాగపు జనసంఖ్యను, వేఱొకకొంద ఱిది గ్రామసంఖ్యను, సూచించు ననిరి. ఒకవిధముగ ఈకడపటిదే సరియైనయూహయని తెలియును. మంచెనకవి తన కేయూర బాహు చరిత్ర మునందు.

............ఏకవింశతి సహస్ర గ్రామసంఖ్యాకమై
ధరణిం బేర్చిన పాకనాడు...

అని పాకనాడు ఏకవింశతి సహస్ర గ్రామ సంఖ్యాకమని చెప్పియున్నాడు అనగా పాకనాటిలో ఇరువది యొక్కవేయి గ్రామములు కలవని తెలియుచున్నది. కాని ఇవి సరిగా గ్రామములే యన్న యెడల ఇప్పటి లెక్కల ప్రకారము చూచినచో నిది యసంబద్ధముగ కాన్పించును; కావున ఈసంఖ్య విస్తీర్ణతను దెలుపునని యూహించుట సమంజసము. నాడులకు జేర్పబడు ఇట్టి సంఖ్యలకు గ్రామము అన్నమాట. చేర్చినను చేర్పక పోయినను మంచన కవి కేయూర బాహు చరిత్రమును బట్టియు, పండితారాధ్య చరిత్రమునుబట్టి అది విస్తీర్ణతనే తెలుపు నని నమ్మదగును. అందువలన వేంగి పదాఱు వేలు అనగా వేంగి పదహారు వేల గ్రామముల విస్తీర్ణత కలది అని అర్థము. ఇట్లే ఇతరనాడులకును దెలిసికొనునది. నది.

ఇందువలన ఆ సంఖ్య విస్తీర్ణతను దెలుపుననిమనకు దెలిసినది. అందువలన గ్రామమన్న నేమో తెలిసికొనవలెను. గ్రామమనగా మనము నివసించు గ్రామమని కాదు ఇక్కడ తీసికొనదగినది. దానిని కొలతకొలుచుటలో నుపయోగపడు కొలమానము గనే గ్రహింపవలెను; ఇప్పుడు భూమిని కొలుచుటలో చతురపు మైళ్ళనెట్లు వినియోగించుచున్నారో అట్లు పూర్వము దేశమును కొలుచుటలో గ్రామము అను కొలత నుపయోగించువారు. ఇప్పుడు చతురపు మైలు భూమికొలతకు 'యూనిట్' ప్రధానమానము. అప్పుడు గ్రామము ప్రధానమానము గనుండెను. పరిపాలనా విధానమునకంతకు గ్రామమే యెట్లు ప్రాతిపదిక నుండెడిదో, అట్లే దేశపుకొలతకును గ్రామమే ప్రాతిపదికగ నుండెడిది. అట్టయిన గ్రామమన్న నెంతకొలత? శుక్రనీతి సారమున పరిమాణములను గుఱించి తెలుపు సందర్భమున గ్రామమన్న ఈక్రింది శ్లోకమున నిట్లు తెలుపబడి యున్నది:

> భవేత్ క్రోశాత్మకో గ్రామో రూప్యకర్ష సహస్రకః;
> గ్రామార్ధకం పల్లీ సంజ్ఞం పల్ల్యర్ధం కుంభసంజ్ఞకం,

క్రోశముపొడవును క్రోశము వెడల్పును గలిగి వేయి వెండికర్షములు రాబడి గలభూభాగమునకు గ్రామమని పేరు. పాకనాడిరువది యొక్క వేయి గ్రామములనగా ఆనాటి యొక్క వైశాల్యము గ్రామమునకు చెప్పబడిన వైశాల్యమునకు ఇరువది యొక్కవేయింతల వైశాల్యముకలది యనియు, ఇరువదియొక్కవేయి వెండికర్షములురాబడి కలదియనియు మన మూహము చేసికొనవలెను.

ఇంతటి వైశాల్యముగల రాజ్యమును ఒక్క రాజు పరిపాలించుట దుర్ఘటము గనుక, ఒక్కొక్క పెద్దవిభాగమునకు ఇప్పుడు తహశీల్ దారు సబుకలెక్టరు కలెక్టరు లఖువలెనే రాజు కొంతమంది యధికారులను నిర్ణయించువారు. వారందఱు సర్వసామాన్యముగా సామంతులు. రాజునకు ప్రతి సంవత్సరము కొంతకప్పముకట్టుచు వారు యుద్ధసమయములందు దమతమ సేనలతో తోడ్పడవలెను. ఇట్టిసామంతులందఱు రాజునకు సేనానాయకులుగను ఆయావిభాగములకు నాయావిశేలకు వారు ఆలోచన చెప్పు మంత్రులుగను పరిగణింపబడుచుండువారు; అనగా రాజు ఆయావిభాగములకు రణరంగకుశలురు యుద్ధనీతి నిపుణులు నయిన వారిని నియమించువారు. వారు కార్యనిర్వహణము నందును, ఖడ్గనిర్వహణమునందును గూడ దక్షులయి యుండువారు. సైన్యాధిపతులే సామంతులై యుండి, సామంతులే సైన్యాధిపతులై యుండి, పరిపాలన మంతయు వారిచేతులమీదనే సాగుచుండుటవలన మన పూర్వులది సైనికపరిపాలన మనవచ్చును. ఆ పదమునకు ఈబ్రిటీషు ప్రభుత్వమువారి హయాములోనున్న యర్థమును మాత్రము చెప్పరాదు. కాని యొక విధముగ స్వభావమునుబట్టి యది సైనిక పరిపాలనమే. రాజు సర్వసైన్యాధిపతి:

యుద్ధాధిష్ఠానదేవత; సామంతులు ఉపగ్రహములు. దీనిని బట్టి మనముగ్రహింపవలసిన విషయమిది:- వీరందఱు-రాజును, రాజప్రతినిధులును కూడ-శిక్షించుటకేర్పడినవారలే. అధికారముయొక్క యోగ్యతనుబట్టి వీరందఱుప్రజలకును రాజునకును మధ్యవారు: ప్రజలను రాజును గలుపు లింకులు, సూత్రములు. అందువలన వీరిని రాజుయొక్క ఏజెంట్లు, కార్యకర్తలు, ప్రతినిధులు అనవచ్చును. వీరలెల్లరు ఆయాగ్రామములనుండియు తద్ద్వారమున ఆయారాజ్యవిభాగములనుండియు రాజునకు చెల్లవలసినపన్ను వసూలుచేసి రాజునకు ముట్టజెప్పుచు, ధర్మాతిక్రమణశిక్షణమునకధికారులై యుండువారు. రాజుయొక్క యుద్యోగులగుటచే తనకు ప్రతినిధులుగ బనిచేయుచున్నందులకు రాజే వారికి గొంతప్రతిఫలము - వేతనమును - రొక్కము రూపమున గాని, లేక దేశమునుండి వసూలగు మొత్తములో నింతయని యొకనిర్ణీత మగు రుసుమురూపమునగాని, లేక తన క్రిందనుండు గ్రామములలో గొన్నిటిరూపమునగాని యొసంగువాడు. ఇట్టి ప్రతినిధులను రాజు ఎట్లు ఏర్పాటు చేయవలెనో అట్టి ప్రతినిధుల యొక్క ధర్మములేవో ప్రతిఫలమేదో మానవ ధర్మశాస్త్రి మనుగ్రంథమున నీదిగువ రీతిని దెలుప బడినది.

గ్రామస్యాధిపతిం కుర్యాద్దశగ్రామపతిం తథా, వింశతీశం శతేశంచ సహస్రాధిపతిం తథా,
గ్రామే దోషాన్ సముత్పన్నాన్ గ్రామికశ్శనకైస్స్వయం, శంసేద్గ్రామదశేశాయ దశేశోవింశతీశినే
వింశతీశస్తు తత్సర్వం శతేశాయ నివేదయేత్, శంసేద్గ్రామశతేశస్తు సహస్రపతయే స్వయం,
యానిరాజప్రదేయాని ప్రత్యహం గ్రామవాసిభిః, అన్నపానేంధనాదీని గ్రామికస్తాన్యవాప్నుయాత్,
దశీకులంతు భుంజీత వింశః పంచకులానిచ, గ్రామం గ్రామశతాధ్యక్షః సహస్రాధిపతిః పురం.

రాజు గ్రామమునకు పది గ్రామములకు ఇరువది గ్రామములకు నూరుగ్రామములకు వేయి గ్రామములకు అధిపతుల నేర్పరుపవలెను. గ్రామములో బుట్టు చోరాదిదోషములను గ్రామాధిపతి తాను తీర్ప వలెను. అట్లు తీర్చుటకు తన కధికారము చాలనిచో పదిగ్రామముల కధిపతి యైనవానికి తెలియ జేయవలెను. ఇటులే ఆయాయధిపతులు ఆయాదోషములు చేసిన వారిని విచారించుటకు చాలనప్పుడు తమకు పైవారికి దెలుపుచుండవలెను. ప్రతిదినము ఆయాగ్రామస్థులు రాజుల కీయనిర్ణీతమైన అన్నపానేంధనాదికములు రాజప్రతినిధిగ వ్యవహరించు గ్రామాధిపతి కొసంగుచుండ వలెను. పదిగ్రామముల కధిపతియైనవాడు ఒక కులముభూమిని తన జీవితార్థ మనుభవింపవలెను. [రెండు నాగళ్లచేత దున్నబడజాలు భూమికి కుల మని పేరు.] ఇరువదిగ్రామముల కధిపతియైన వాడు అయిదుకులముల భూమి ననుభవింపవలెను. శతగ్రామముల కధిపతియైనవాడొకగ్రామమును, సహస్రగ్రామముల కధిపతియైనవాడొకపురమును అనుభవింపవలెను. అని పైశ్లోకముల తాత్పర్యము.

రాజప్రతినిధులై ఆయాయధిపతులు విశృంఖలముగ సంచరించి ప్రజాకంటకులుగ ప్రవర్తింతురేమో యని యట్టివారి చర్యలను ప్రజాక్షేమనిమిత్తము రాజు చారులను నియోగించి తెలిసికొనుచుండవలెనని ధర్మశాస్త్రవిశారదుండైన మను విట్లు చెప్పుచున్నాడు:

స తానసుపరిక్రామేత్సర్వానేవ సదా స్వయం,
తేషాం వృత్తం పరిణయేత్సమ్యగ్రాష్ట్రేషు తచ్చరైః.

దుష్టశిక్షణమునకును, ధర్మరక్షణమునకు మాత్రమే రాజు నియోగింపబడినవాడనియు, ప్రజలయొక్క క్షేమమే రాజు లక్ష్యముగా నుంచుకొనవలసిన ముఖ్యవిషయమనియు పై విషయములవలన తెలియగలదు. అందువలన రాజుయొక్కగాని, అతని ప్రతినిధియొక్కగాని నిర్వర్తింపవలసిన ధర్మము ద్వివిధమని నిశ్చయింపవచ్చును: (౧) దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించి ధర్మమును కాపాడుట (౨) ప్రజలకు పరరాజులవలని యుపద్రవములు రాకుండ పరిరక్షించుట. ఇవియేవారి విధులు. ఇదియంతయు ప్రాచీనహిందూరాజధర్మ పరిపాలనాక్రమము.

ఇది యంతయు రాజధర్మపరిపాలనాక్రమమైన ప్రజాపరిపాలనాక్రమము పూర్వము ఎట్లుండెడిది అను ప్రశ్న కలుగవచ్చును. రాజపరిపాలనమనగా పూర్వము 'ధర్మ' పరిపాలన మనియే మనమర్థము చేసికొనవలసియుండును అందువలన ప్రాచీన రాజపరిపాలనమున నొకరీతిగ ప్రజాపరిపాలనము లేదనియే నుడువ దగును. ప్రాచీనకాలమున రాజ పరిపాలనమునకు భిన్నమైన ప్రజాపరిపాలనము నిజముగా ప్రజల చేతులలోనే యుండెడిది.

మల్లంపల్లి సోమశేఖరశర్మ